Photo by P. K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

పసి గట్టిన దొంగలు

పంపినవారు :
బి. వనమయ్య - కోవెలకుంట్ల

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక కార్టూనులు, ఫొటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.


అద్వితీయమైన నాణ్యము! అతి సరసమైన మూల్యము !!

FOR Costly PENS
Iris
INKS










ఐరిస్
సిరాలు

ఫౌంటెన్ కలములకు పేరెన్నిక కన్నవి,
1, 2, 4, 12, 24 ఔన్సుల ప్యాకింగులలో లభించును.

తయారుచేయువారు:
రీసెర్చి కెమికల్ లెబొరేటరీస్
మద్రాసు-4 ★ న్యూఢిల్లీ-1 ★ బెంగళూరు-3




రిజిస్టర్డు నం: 119923

# డైమండ్ సుగంధవక్క పొడి

## ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధిచెందినదిన్నీ. మీరు ఈసారి వక్కపొడి కొనే టప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

పొట్లం ఒకింటికి 2 న. పై. మాత్రమే.

## ది డి. పి. అండ్ కంపెని,

## కౌల్‌బజార్ - బళ్ళారి - 1.

సెల్సు డిపోలు

చీరాల - గుంటూరు - కర్నూలు - అదోని - హుబ్లి.

ఆంధ్ర రాజధానిలో నిర్మించిన ప్రథమ చిత్రం!

నేడే చూడండి!










...దర్శకుడు...
జి.రామినీడు

...నిర్మాత...
పి.గంగాధరరావు

శ్రీ సారథి

PRASAD

# 'చందమామ' కు

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్దికాపీలు కూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 3-0-0 పంపుతూవుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

★

చందమామ పబ్లికేషన్సు,
వడపళని, మద్రాసు - 26



## సౌందర్య అతిశయం




రాజా స్నో దగ్గర వుంటే, మీరు ఎల్లప్పుడు సౌందర్యాతిశయంతో ప్రకాశిస్తారు. రాజా హెయిర్ ఆయిల్ మరింత కాంతి నిచ్చి, చక్కటి దీర్ఘమైన కేశములను విరివిగా పెంపొందిస్తుంది.









Use RAJA KASTURI SOAP for luxury Bath,
RAJA BAR SOAP for easy washing.

★ ★ ★

MFRS: MANYAM & CO., BANGALORE-3 . . . . .

GP



# సముద్రపు జాలర్లు

కేరళ రాష్ట్రంలో నీలి అరేబియా సముద్రాన్ని అనుకుని కనుల పండువైన మలబారు వుంది. ఇక్కడ చూడ చోద్యమైన రమణీయమైన ప్రదేశాలు చాలా వున్నాయి. కాని సముద్ర తీరాన కొబ్బరితోటల చుట్టూ వున్న బెస్త పల్లెల శోభ వేరు.

మలబారు బెస్త పల్లెలో మట్టితో చక్కగా కట్టి అలికిన పూరిగుడిసెలు, ఎదురుగా కనిపించే సముద్ర తీరం తళ తళ మెరిసే యిసక చూచితీరవలసిందే. దృఢకాయులైన జాలరివాళ్లు వర్షాకాలంలో గాలి ఉధృతంగా వీస్తున్నప్పుడు, సముద్రపు పోటు వచ్చినప్పుడు తప్ప ఏడాది పొడుగునా చేపలు పడుతుంటారు. ప్రొద్దు పొడవకుండా సముద్రం మీదికి వెళ్ళి, సంధ్యవేళకు మోయలేనన్ని చేపలతో తిరిగి వచ్చి ఇరుగు పొరుగు గ్రామాల్లో, పట్టణాల్లో అమ్ముకుంటారు. చేపల వేట అయ్యాక వలలను, పడవలను మరమ్మతు చేసుకొని, కొబ్బరి తాళ్ళు అల్లుకుంటారు. నిస్సందేహంగా చాలా కష్టమైన పని. అయినా వీలున్నప్పుడల్లా నలుగురూ చేరి టీ త్రాగుతూ కబుర్లు చెప్పుకుంటారు. వారి ప్రియమైన టీ బ్రూక్ బాండ్ అని వేరే చెప్పక్కర్లేదు. దేశపు అన్ని చోట్లలాగే మలబారులో కూడా బ్రూక్ బాండ్ టీ తోట పదును తాజాగా సరఫరా అగుటచే చిన్నా పెద్దా కూడా అదే త్రాగుతుంటారు.

మలబారు కొబ్బరికాయలకు, జీడిపప్పు, ఏలకులు. లవంగాలు, రబ్బరుకు చాలా ప్రసిద్ధికెక్కింది. అయినా ఆ బెస్త పల్లె దానిలో నివసించే అమాయకపు బెస్తలు దానికి ఎక్కువ శోభ చేకూరుస్తున్నాయి. వారి జీవనోపాధికి ఆధారమైన సముద్రమంటే జాలర్లకు చాలా అభిమానం. వీరు పనికి వెళ్ళేముందు, తిరిగి వచ్చాక బ్రూక్ బాండ్ టీ త్రాగుతారు. ఏమంటే అది ఉత్సాహము, ఉల్లాసము చేకూరుస్తుంది.

బ్రూక్ బాండ్ ఇండియా ప్రైవేట్ లిమిటెడ్.

BB 297



# మాజ్డ దీపములు

ఎక్కువ కాలము ప్రకాశవంతముగా వెలుగును







అసోసియేటెడ్ ఎలెక్ట్రికల్ ఇండస్ట్రీస్
(ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్
హెడ్ ఆఫీసు : క్రౌన్ హౌస్, 6, మిషన్ రో, కలకత్తా
బ్రాంచీలు
బొంబాయి, న్యూఢిల్లీ, మద్రాసు, బెంగుళూరు, కోయంబత్తూరు, నాగపూరు
నియమించబడ్డ డీలర్లు :
AIC 208 TE

రఘునాథ ట్రేడింగ్ కార్పొరేషన్, గుంటూరు. :: మచ్‌కుండ్ ఎలెక్ట్రికల్ స్టోర్సు, విజయవాడ-2.
మోటార్స్ & జనరల్ స్టోర్స్ ప్రైవేట్ లిమిటెడ్, బొబ్బిలి.



# ఎక్కడ విన్నా న్యూట్రిన్ ప్రశంసే!

Nutrine

పిల్లలకు న్యూట్రిన్ "డ్రమ్" అంటే ఎంతో యిష్టం. ఏమంటే, న్యూట్రిన్ కంపెనీవారు అందముగా ప్యాక్ చేయుటలో కొత్త పద్ధతిని అవలంబిస్తున్నారు. అత్యంత రుచికరమైన న్యూట్రిన్ మిఠాయిలు, టాఫీలు ఒక ఆకర్షణీయమైన పెట్టెలో అమర్చబడిన్ని, ఖరీదు హెచ్చింపబడక, మామూలు వెలకే అన్ని చోటులందు లభిస్తున్నవి.






మీ మధురానందమునకు :

## ది న్యూట్రిన్ కన్ఫెక్షనెరీ కో., లిట్.,

చిత్తూరు - (ఆంధ్ర ప్రదేశ్)

ఏ విధమయిన అచ్చుపనులైనను
అతి చక్కగా...
అనుకొన్న గడువులో
మేము చేసి యివ్వగలము!

★

మా ముద్రణశాఖకు తోడుగా చిత్రకళాశాఖ,
బ్లాకు తయారీశాఖ, లితో-ఆఫ్‌సెట్
సంస్థలు సమకూడి వున్నవి.

★

ది బి. ఎన్. కె. ప్రెస్
(ప్రైవేట్) లిమిటెడ్
చందమామ బిల్డింగ్స్
వడపళని :: మదరాసు-26

ఫోన్: 88851—4 లైన్లు

అన్నిచోట్ల అందరికి అందుబాటులో వుండే మా సాటిలేని




# రాజా
బనియనులు

రాజా నిట్టింగ్ కంపెని
P. B. No. 24, తిరుపూరు

ఏజంట్లు:

గొల్లపూడి బ్రదర్సు
సత్యనారాయణపురం :: విజయవాడ-2

పేరెన్నికగన్న మా "KKK" రకమును అడగండి.





నాణ్యతయే
నమ్మకమును
కలిగించును

VUMMIDIAR'S

VUMMIDI RAMIAH CHETTY
GURUSWAMY CHETTY & Co

ఉమ్మిడి రామయ్యచెట్టి గురుస్వామిచెట్టి అండ్ కో.,
నగల వర్తకులు - వెండిపనివారలు
23-25, నేతాజీ సుభాష్‌చంద్రబోస్ రోడ్డు, మద్రాసు - 1







**J. B. MANGHARAM & CO.,**
GWALIOR, INDIA

*makers of famous biscuits*

**జె. బి. మంఘారామ్ అండ్ కో.,**
**గ్వాలియర్, ఇండియా**

ప్రసిద్ధిగాంచిన బిస్కత్తు నిర్మాతలు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

కిందటి నెల మేము కోరిన ప్రకారం చాలామంది పాఠకులు "చందమామ"ను గురించి తమ అభిప్రాయాలు తెలిపారు. కొందరు కేవలమూ తమ అభిమానాన్ని మాత్రమే ప్రకటించారు. కొంతమంది మాత్రం కొన్ని సూచనలనుకూడా చేశారు. వాటిలో ఆచరణీయమైన వాటిని క్రమంగా "చందమామ"లో ప్రవేశపెట్టగలము.

దాదాపు పాఠకులందరూ "ప్రశ్నోత్తరాలు" శీర్షిక ప్రవేశపెట్టమని కోరారు. ఈ శీర్షికను అగస్టు నెల నుంచి ప్రవేశపెట్ట నిశ్చయించామని తెలియజేయటానికి ఆనందిస్తున్నాము. పాఠకులు తమ విజ్ఞానాన్ని పెంపొందించుకొనటానికి మాత్రమే ఈ శీర్షికను వినియోగపరచుకుంటారని ఆశిస్తున్నాము. రాజకీయ సంబంధమైన, మత సంబంధమైన సందేహాలను దయచేసి పంపకండి.

సంపుటి 25 : జూలై 1959 : సంచిక 1





CHITRA




యుద్ధం అయిపోయింది, కాని ఎవరు ముందు వెనక్కు తిరగాలనేది తేలలేదు. "ముందు వాణ్ణి తిరగమనండి! వాడు నన్ను ఎదిరించి నిలబడి ఉండగా నేను తిరిగిపోతానా?" అన్నాడు పరశురాముడు.

"యుద్ధంలో వీపు చూపననీ, నా వెనక పార్శ్వంలో బాణం తగలగూడదనీ నాకు వ్రతం ఉన్నది," అన్నాడు భీష్ముడు.

అందరూ చేరి చివరకు పరశురాముడి చేతనే ముందు యుద్ధం మాన్పించారు. ఆ తరవాత భీష్ముడు వచ్చి ఆయన కాళ్లపై పడ్డాడు. పరశురాముడు చిరునవ్వు నవ్వి, "క్షత్రియులలో నీవంటివాణ్ణి నే నెన్నడూ చూడలేదు. నువు చేసిన యుద్ధం నాకు చాలా నచ్చింది," అన్నాడు.

తరవాత పరశురాముడు అంబకేసి తిరిగి విచారంగా, "అమ్మాయీ, చూశావుగదా! నీకు జరిగిన అన్యాయాన్ని సరిచెయ్యటానికి నాకు చేతనైనంతా చేశాను. ఇక నేను చేయగలది ఏమీ లేదు," అంటూ దీర్ఘంగా ఒక నిట్టూర్పు విడిచాడు.

తనను భీష్ముడు ఓడించినట్టు పరశురాముడు చెప్పగానే అంబ, "మహాత్మా, నాకు నీ చేతనైన సాయం చేశావు, కాని ఫలితం లేకపోయింది. నీచేత ఓడని భీష్ముడు దేవతలకుకూడా ఓడడు. అయినా నేను భీష్ముణ్ణి శరణు వేడను. ఎప్పటికైనా, ఎలాగైనా ఆయనను నేనే ఓడించాలి. అందుకు మార్గం ఏమిటో వెతుకుతాను!" అంటూ తన దారిన తాను వెళ్లిపోయింది. పరశురాముడు మునులతోసహా మహేంద్రగిరికి వెళ్లిపోయాడు.

భీష్ముడు బ్రాహ్మణుల ఆశీర్వాదాలు పొంది ఇంటికి తిరిగి వచ్చేశాడు.

ఆయన సత్యవతికి జరిగినదంతా చెప్పాడు. ఆవిడ భీష్ముణ్ణి చాలా మెచ్చు






కున్నది. తరవాత భీష్ముడు అంబ వెనకగా వేగులవాళ్లను పంపి, ఆమె ఎక్కడికి పోతుందో, ఏమేమి చేస్తుందో ఎప్పటి కప్పుడు తనకు తెలియజేస్తూండవలసిందిగా ఆజ్ఞాపించాడు. వారు ఆ ప్రకారమే భీష్ముడికి అంబను గురించిన వార్తలు వివరంగా తెలుపుతూ వచ్చారు.

అయినా అంబ భీష్ముడికి పక్కలో బల్లెంలాగా తయారయింది. ఆమె తనను చంపటానికిగాను తపస్సు చేస్తానని ప్రతిజ్ఞ చేసి పోయింది. పరశురాముడు ఎంతో తపశ్శాలి అయిఉండికూడా తనను జయించలేకపోయాడు. అయినా భీష్ముడు అంబను తలుచుకుని భయపడసాగాడు. చివరకాయన తన భయాన్ని వ్యాసుడికీ, నారదుడికీ విన్నవించుకున్నాడు. "నీవు అంబను గురించి ఇంతగా విచారించటం అనవసరం. విధి నిర్దేశం ఎలాఉంటే అలా అవుతుంది!" అని ఆ ఇద్దరూ విడివిడిగా భీష్ముడికి ధైర్యం చెప్పారు.

కురుక్షేత్రంనుంచి బయలుదేరిన అంబ యమునాతీరాన గల ఋష్యాశ్రమాలకు వెళ్లి అక్కడ ఘోరతపస్సు ప్రారంభించింది. ఆమె ఆహారం మానేసి, శరీరాన్ని కృశింపజేసి, శరీరంనిండా మట్టి పట్టించుకుని తపస్సు చేసింది; కంఠంవరకూ నీటిలో మునిగి ఆరు మాసాలు తపస్సు చేసింది. ఒక ఏడాది నిరాహార తపస్సు చేసి, తరవాత రోజుకు ఒక పండుటాకు తింటూ, కాలి బొటనవేలిపై నిలబడి మరొక సంవత్సరం తపస్సు చేసింది. ఈ విధంగా ఆమె పన్నెండు సంవత్సరాలు కఠోర తపస్సు చేసింది; ఎంద రెన్నివిధాల చెప్పినా ఆమె తపస్సు మానలేదు.

ఆ తరవాత ఆమె వత్సదేశానికి వెళ్లి అక్కడి ఆశ్రమాలన్నీ చూసింది. తరవాత ఆమె పుణ్యక్షేత్రాలు సేవిస్తూ సంచారం ప్రారంభించి చ్యవనాశ్రమం, బ్రహ్మస్థానం,

ప్రయాగ, దేవారణ్యం, భోగవతి, రామహ్రదం మొదలైన అనేక చోట్లకు వెళ్లింది.

అంబ ఇలా తపస్సుతోపాటు తీర్థ యాత్రలు చేసే కాలంలో భీష్ముడి తల్లి అయిన గంగ ఆమెను కలుసుకుని, "అమ్మాయీ, నీవు దేనికిగాను ఇన్ని కష్టాలు పడుతూ తిరుగుతున్నావు?" అనిఅడిగింది.

"అమ్మా, నాకోసం పరశురాముడంతటి వాడు భీష్ముడితో యుద్ధంచేసి ఓడిపోయాడు. అటువంటి భీష్ముణ్ణి ఇంకెవరు చంపగలరు? నేనే ఆయనను చంపే శక్తి సంపాదించాలని శ్రమపడుతున్నాను. నా కోరిక సిద్ధించేటట్టు వరమియ్యి తల్లీ!" అన్నది అంబ.

"ఓసీ, స్త్రీవై పుట్టి నీకి కోరిక ఏమిటి? ఇది ఎన్నటికీ సిద్ధించదు. ఇలాటి ప్రయత్నం లోనే నీవు చనిపోయావంటే ఎప్పటికైనా నీవు నదివైపోతావు. నీలో భయంకరమైన మొసళ్లుంటాయి. ఏడాదికి నాలుగు మాసాలు మాత్రమే నీలో నీరుంటుంది; మిగిలిన ఎనిమిది మాసాలూ నిన్ను చూసి నది అనికూడా ఎవరూ అనుకోరు!" అంటూ గంగ వెళ్లిపోయింది.

తరవాత కొంతకాలానికి గంగ చెప్పినట్టే జరిగింది. అంబ మత్స్యదేశంలో నడుస్తూ ఒకచోట స్పృహతప్పి పడిపోయింది. ఆమె పడిపోయిన చోట అంబానది పుట్టింది. ఆ



నదికి వర్షాకాలంలో వరదలు వస్తాయి, భయంకరమైన మొసళ్లతో నిండి ఉంటుంది; ఏడాదికి ఎనిమిది మాసాలు అందులో నీరుండదు.

అంబను చూసి ఎందరో ఋషులు, "అమ్మా, నీవు ఏమి కోరి తపస్సు చేస్తున్నావు?" అని అడిగారు. వారందరికీ అంబ, "అయ్యా, నేను ఉత్తమలోకాలు కోరను. ఎలాగైనా భీష్ముణ్ణి చంపటానికే నేనిలా తపస్సు చేస్తున్నాను. నాకు భర్తా, సంసారమూ లేకుండా పోయాయి. నాది ఆడబ్రతుకూ కాదు, మగబ్రతుకూ కాదు. నాకు ఆడజన్మమీద మొహం మొత్తింది. ఎత్తితే మగజన్మే ఎత్తాలి! ఎలాగైనా భీష్ముణ్ణి యుద్ధంలో చంపాలి. అందుచేత నన్ను మీరు నివారించకండి!" అనేది.

చివరకు అంబ కోరిక అనుకోని విధంగా ఫలించింది. శివుడు ఆమె తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమై, "అంబా, ఏం వరం కోరుతావు?" అని అడిగాడు.

"దేవా, నేను భీష్ముణ్ణి జయించేటట్టు అనుగ్రహించు!" అన్నది అంబ. "అలాగే జయిస్తావు!" అన్నాడు శివుడు. "దేవా, నేను స్త్రీనిగదా మహాపరాక్రమశాలి అయిన భీష్ముణ్ణి ఎట్లా జయిస్తాను? నీమాట అసత్యం కాదుగదా?" అన్నది అంబ.







"ఎన్నటికీ కాదు. వచ్చే జన్మలో నీకు పురుషత్వం లభిస్తుంది; నీవు భీష్ముణ్ణి సంహరిస్తావు!" అన్నాడు శివుడు.

శివుడు అంతర్ధానం కాగానే అంబ మునీశ్వరులంతా చూస్తుండగానే ఒక చితి పేర్చుకుని, యమునానదివేపు తిరిగి నమస్కారం చేసి, "భీష్ముణ్ణి చంపగలందులకు నేను అగ్నిప్రవేశం చేస్తున్నాను!" అని పలికి, చితిలో పడి కాలిపోయింది.

ఇదే సమయంలో పాంచాలదేశపు రాజైన ద్రుపదుడుకూడా శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. ఆయన తపస్సుకు రెండు కారణాలు. ద్రుపదుడికి పిల్లలు లేరు; సంతానం కావాలన్నది ఒక కోరిక. ద్రుపదుణ్ణి భీష్ముడు ఓడించిఉన్నాడు; భీష్ముణ్ణి జయించగలవాడు తన కడుపున పుట్టాలన్నది రెండో కోరిక.

ద్రుపదుడి తపస్సుకూడా ఫలించింది. శివుడు ప్రత్యక్షమై, "నీ కడుపున ఒక కూతురు కలుగుతుంది!" అని వరమిచ్చాడు.

"దేవా, నాకు కూతురెందుకు? భీష్ముణ్ణి చంపగల కొడుకును ప్రసాదించు!" అని ద్రుపదుడు ప్రార్థించాడు.

"ఆ కూతురే తరవాత కొడుకుగా మారి భీష్ముణ్ణి చంపుతుంది. అంతతో తృప్తిపడి ఇంటికి వెళ్లిపో!" అన్నాడు శివుడు.

ద్రుపదుడు ఇంటికి తిరిగివచ్చి తన భార్యతో జరిగినదంతా చెప్పాడు. తరవాత ద్రుపదుడి భార్య గర్భవతి అయి, నవ మాసాలు మోసి, శివుడు చెప్పిన విధంగానే ఒక ఆడపిల్లను కన్నది. ఆ పిల్ల రహస్యం తల్లిదండ్రులకు మాత్రమే తెలుసు. ద్రుపదుడు అందరితోటీ తనకు మగపిల్లవాడు కలిగాడని చెప్పాడు, ఆ పిల్లవాడికి శిఖండి అని నామకరణం చేశారు.

శిఖండికి మగపిల్లవాడి దుస్తులే వేసి, మగపిల్లవాడులాగే పెంచారు. ఆ పిల్లకు చిత్రలేఖనమూ, శిల్పమూ నేర్పించారు,







విలువిద్యకూడా చెప్పించారు. శివుడు చెప్పినట్టుగా ఆ పిల్ల ఉన్నట్టుండి పురుషుడయిపోతుందనే గట్టినమ్మకంతో ఉన్న ద్రుపదుడికి ఆమెలో నానాటికీ వృద్ధి అయే స్త్రీ లక్షణాలే కనిపించాయి. ఆయన భయపడుతూ తన భార్యతో, "నేను శివుడి మాటలు నమ్మి ఇది మగవాడని ఇంత కాలమూ అందరితోనూ అబద్ధం చెప్పేశాను. చూడగా చూడగా ఇది యుక్తవయస్కురాలై దీని రహస్యం అందరికీ తెలిసిపోయేలా గున్నది. నాకు మతి పోతున్నది. నీకేదైనా ఉపాయం తోస్తే చెబుదూ!" అన్నాడు.

"దీనికి ఒక్కటే ఉపాయం, తగిన కన్యను చూసి పెళ్లిచేసేద్దాం! తరవాత శివుడు చెప్పినట్టు అది మగవాడు కానే అవుతుంది. అప్పుడు మరే చిక్కూ ఉండదు!" అన్నది ద్రుపదుడి భార్య. ఈ సలహా ద్రుపదుడికి కూడా నచ్చింది.

*　　*　　*

దశార్ణదేశంలో హిరణ్యవర్మ అనే రాజుకు ఒక యీడువచ్చిన కుమార్తె ఉన్నది. హిరణ్యవర్మ చాలా పెద్ద బలగం కలవాడు, చాలా బలశాలికూడానూ. ద్రుపదుడు తన కూటంలోని రాజులందరికీ హిరణ్యవర్మ కులగోత్రాదులు చెప్పి, ఆయన కుమార్తెను, శిఖండిని అనేదాన్ని, తన కుమారుడైన శిఖండికి చేసుకోబోతున్నానని తెలియబరిచాడు. పాంచాల రాజుతో వియ్యం చెయ్యటానికి దశార్ణరాజైన హిరణ్యవర్మకూడా ఎంతో సంతోషించాడు.

శిఖండికీ శిఖండినికీ వివాహం జరిగింది. శిఖండి రహస్యం శిఖండినికి తెలిసిపోయింది. ఆమె తనవెంట వచ్చిన దాసీలతో, "నా భర్త పురుషుడు కాడు, నాలాగే ఒక స్త్రీ!" అని రహస్యంగా చెప్పేసింది. వారీ మాట విని నివ్వెరపోయి ఎవరికీ తెలియకుండా ఈ వార్తను దశార్ణదేశానికి చేరవేశారు.



తన కూతురికీ, తనకూ ద్రుపదుడు చేసిన అన్యాయావమానాలను గ్రహించుకుని హిరణ్యవర్మ ఉగ్రుడైపోయాడు. "నీ కూతురు మగవాడని అబద్ధమాడి నా కూతుర్ని ఆమెకు పెళ్లి చేసినందుకుగాను నిన్నూ, నీ వంశాన్నీ సర్వనాశనం చేయబోతున్నాను!" అని ఆయన ఒక దూత ద్వారా ద్రుపదుడికి కబురుచేశాడు. ఆ దూత ఈ మాటలను రహస్యంగా ద్రుపదుడి చెవిని వేశాడు.

తాను ఎంతోకాలం దాచిన శిఖండి రహస్యం హిరణ్యవర్మకు తెలిసి ఆయన ఆగ్రహించాడని వినగానే ద్రుపదుడు కొయ్యబారిపోయి, మాటాడలేకపోయాడు. ఆయన తియ్యగా మాట్లాడగలవాళ్లను పిలిచి, "మీరు హిరణ్యవర్మ వద్దకు వెళ్లి, నేను ఆయనను ఏ విధంగానూ మోసం చెయ్యలేదని నచ్చజెప్పి ఆయన ఆగ్రహం పోగొట్టండి!" అన్నాడు.

అయితే ద్రుపదుడి యత్నాలు ఫలించలేదు. తన అల్లుడనుకున్న మనిషి ఆడదన్న సంగతి రూఢిగా ఎరిగిన హిరణ్యవర్మ తన బంధువర్గాన్నంతనూ పిలిచి, ద్రుపదుణ్ణి హతమార్చటానికి బలాలన్నిటితోనూ బయలుదేరమన్నాడు. హిరణ్యవర్మ బంధువులు, "నీవు చెప్పినదే నిజమైతే ఆ ద్రుపదుణ్ణి కట్టి తెస్తాం. అతని కూతురినీ, బంధువులనూ హతమార్చి పాంచాలదేశానికి కొత్త రాజును ఏర్పాటుచేస్తాం!" అన్నారు.

హిరణ్యవర్మ వద్దనుంచి మళ్లీ దూతలు వచ్చి ద్రుపదుడితో, "మా రాజు నిన్ను హతమార్చటానికి ఎత్తివస్తున్నాడు. నీవు కూడా యుద్ధానికి సిద్ధంగా ఉండు!" అన్నారు. ద్రుపదుడు వారితో బింకంగా సరేనని చెప్పి పంపేశాడుగాని లోపల గుండె అదిరిపోతున్నది.

ఆయన చాలా పిరికివాడు; దానికి తోడు తప్పుచేసి ఉన్నాడు.






## 13

[చంద్రవర్మా, కాపాలినీ శంఖుడి మంత్రగృహం వున్న కొండమీదికి ఎక్కారు. అక్కడ కాపాలినికోసం చంద్రవర్మా, కాలకేతుడూ కలిసి చిన్న ఇల్లు కట్టారు. చంద్రవర్మ మర్నాటి వుదయం కాపాలినీ, కాలకేతుల దగ్గిర సెలవుతీసుకుని అరణ్యంలో ప్రవేసించాడు. అతడికి ఒక మహావృక్షం కింద ఒక ఇనపగొలుసు దొరికింది. ఆ వెంటనే భయంకరాకృతిలో వున్న ఒక దయ్యపుకుక్క మొరుగుతూ అతడిమీదికి రాసాగింది. తరవాత—]

దయ్యపు కుక్క భయంకరంగా నోరు తెరిచి, తన కంఠాన్ని ఒడిసిపట్టేందుకు చెంగున మీదికి వురికేంతలో, చంద్రవర్మ తన కత్తి మొనతో దాని గుండెలమీద పొడిచేందుకు తల వంచి ముందుకొక అడుగు వేశాడు. అదే సమయంలో అతడి ఎడమచేత గల ఇనపగొలుసు ఛెళ్లుమని దయ్యపుకుక్క తలమీద గట్టిగా తగిలింది. కుక్క ఎగిరి అల్లంత దూరాన వెల్లకిలా పడిపోయింది.

చంద్రవర్మ మెరుపులా గిరున వెనుదిరిగి భీకరంగా అరుస్తూ, దయ్యపుకుక్కను సమీపించ బోయేంతలో, అది లేచి నిలబడి ఒక్క తృటికాలం చంద్రవర్మ చేతులో వున్న ఇనపగొలుసుకేసి చూసి, చప్పున వెనుదిరిగి పాదలదగ్గిరకు పరిగెత్తి, అక్కడ తోక ఆడిస్తూ నిలబడింది.

దయ్యపుకుక్కలో వచ్చిన యీ వింత మార్పు చూస్తూనే చంద్రవర్మ చాలా ఆశ్చర్య



పడ్డాడు. అతడు తన చేతులో వున్న ఇనప గొలుసుకేసి ఓమారు చూసుకుని దాన్ని దయ్యపుకుక్క నిలబడివున్న చోట పడేలా విసిరివేశాడు. దయ్యపుకుక్క ఆ గొలుసును ఒకసారి వాసన చూసి, దాన్ని నోట కరుచుకుని చంద్రవర్మ దగ్గిరకు వచ్చి, తోక ఊపుతూ నిలబడింది. ఈ సంఘటనతో చంద్రవర్మకు ఆ ఇనపగొలుసులో ఏదో ప్రభావం వున్నట్టు అర్థమైంది. అతడు ఆ గొలుసును కుక్క నోటినుంచి తీసుకుని ఒక కొసను దాని మెడకు బిగించాడు.

కుక్క ఒకమారు చుట్టూ కలయ చూసి, పెద్దగా మొరుగుతూ చంద్రవర్మను పొదలకేసి గుంజసాగింది. అది తనను ఎక్కడికో తీసుకు పోదలచిందని గ్రహించిన చంద్రవర్మ, ధైర్యంగా దాని వెనక నడవసాగాడు. ఆసరికి చంద్రవర్మకు అది శునక రూపంలో వున్న ఏ రాక్షసుడో కాదనీ, నిజమైన శునకమే అయివుండవచ్చనీ తోచింది.

కుక్క ముళ్లపొదల మధ్యగా కొంత దూరం నడిచి, చంద్రవర్మను ఒకానొక కొండగుట్టమీదికి తీసుకువచ్చింది. ఆ గుట్ట దిగువగా వున్న పల్లంలో, ఒక సెలయేటి పక్కన చిన్న గుడిశె ఒకటి చంద్రవర్మ కంటబడింది. బహుశా, ఆ గుడిశెలో కుక్క యజమాని నివసిస్తూ వుంటాడనీ, తనను కుక్క అతడిదగ్గిరకు తీసుకుపోతున్నదనీ చంద్రవర్మ వూహించాడు. ఆ వెంటనే అతడు తన చేత గల గొలుసునుకూడా కుక్క మెడకు చుట్టి దాని వెనకగా కొండ గుట్టమీది నుంచి దిగి సెలయేటి అంచునే నడుస్తూ గుడిశెను సమీపించాడు.

గుడిశెలోనుంచి ఎవరూ బయటికి రాలేదు. కుక్క పెద్దగా మొరుగుతూ గుడిశెలోకి పోయి, అంతలోనే బయటికి వచ్చి చుట్టూ కలయచూడసాగింది. ఈ గుడిశెలో ఎలాంటి వ్యక్తి నివసిస్తున్నాడో, అనుకుంటూ చంద్రవర్మ జాగ్రత్తగా గుడిశెలోకి వెళ్లాడు.






లోపల ఎవరూ లేరు. ఒక మూలగా ఒక కుక్కిమంచం వున్నది. మరోవైపున గోడ నానుకుని చిన్నపొయ్యీ, దాని ముందు రెండు మూడు కుండలూ, చిన్న మట్టి పాత్రలు కొన్నీ వున్నవి. ఇంటి వాసాలకు వేలాడుతున్న ఒక తాడుమీద ఒక గొంగళీ, చిరిగిపోయిన కొన్ని బట్టలూ వున్నవి.

ఈ గుడిసెలో ఎవరో బీదవాడు నివసిస్తున్నాడని చంద్రవర్మ భావించాడు. కాని, అంతలోనే అతడికొక అనుమానం కలిగింది. ఇంత భయంకరారణ్యం మధ్య ఆ బీదవాడు కాలం గడపవలసిన అవసరం ఏం కలిగింది? వీడెవడైనా మరొక మాంత్రికుడా?

చంద్రవర్మకు యీ అనుమానం కలగ్గానే, అతడు చప్పున ముందుకు నడిచి, పొయ్యి దగ్గిర వున్న కుండలను సమీపించి, వాటిని పరీక్షించి చూడసాగాడు. వీడెవడైనా నరమాంస భక్షకుడైతే, ఆ కుండల్లో మానవాస్థికలు దొరకవచ్చునని అతడి వూహ.

చంద్రవర్మ తన పనిలో నిమగ్నుడై వుండగా హఠాత్తుగా వెనకనుంచి హెచ్చరిక వినబడింది. "ఉన్న చోటునుంచి కదలకు. కదిలేందుకు ప్రయత్నించావో.... వెన్నులో ఈటెపోటు పడుతుంది! వెనుతిరిగి చూడకుండా, నా ప్రశ్నలకు జవాబు లివ్వాలి."

చంద్రవర్మకు ముచ్చెమటలు పోసినై. ఎలాంటి శత్రువునుంచి తనకు ప్రమాదం రానున్నదో చూసేందుకైనా అవకాశం లేదు. బహుశా, తన వీపువెనక నిలబడివున్న ఆ శత్రువు, ఈటెను వెన్నుమీదికి గురిచేసి వుంటాడు. కనుక, వెనుదిరిగేందుకు ప్రయత్నించటం వృథా.

"నేను నీకు శత్రువునుకాదు, మిత్రుణ్ణి! నా ముఖం చూస్తే ఆ సంగతి గ్రహించగలవు," అన్నాడు చంద్రవర్మ భయాన్ని కప్పిపుచ్చుతూ.

"నువ్వా? నాకు మిత్రుడివా...ఛీ," అన్నాడు వెనక నిలబడివున్న వ్యక్తి. తరవాత



ఓ క్షణకాలం ఆగి, "నీతోపాటు వచ్చిన రాజభటు లెక్కడ ?" అని ప్రశ్నించాడు.

"రాజభటులా ?" అంటూ చంద్రవర్మ ఆశ్చర్యపోయి, "నేను యీ అరణ్యంలో ఒంటరిగానే తిరుగుతున్నాను. దైవకృపవల్ల నీ దయ్యపు కుక్కకు ఆహారంకాకుండా నన్ను ఒక ఇనపగొలుసు కాపాడింది. ఆ కుక్క దారిచూపగా, నేనిక్కడికి వచ్చాను," అన్నాడు చంద్రవర్మ.

"ఆ ఇనపగొలుసు నీ ప్రాణాన్ని కాపాడిందనేదాంట్లో సందేహం ఏమీలేదు. ఆ గొలుసునే నా కొడుకు కుక్క మెడకు కట్టి దానిని వెంటపెట్టుకుని అరణ్యంలో తిరుగుతూండేవాడు. వాణ్ణి రాజభటులు పట్టుకుపోయినప్పుడు, ఆ గొలుసు అరణ్యంలో ఎక్కడో పడిపోయింది. అది నీ చేతిలో వుండటం పసిగట్టి, నీవు తన యజమానికి మిత్రుడివని భావించి కుక్క నిన్ను చంపకుండా వదిలింది. ఇంతకీ నా కొడుకు బతికే వున్నాడా ? లేక రాజు వాణ్ణి చంపించాడా ?" అన్నాడావ్యక్తి.

చంద్రవర్మకు అంతా అయోమయంగా వున్నది. వీడెవడో తనను రాజభటు డనుకుంటున్నాడు. తన కొడుకుకు పట్టిన దుర్గతికి కారకులైనవారిలో తను ఒకడని అతడు భావిస్తుండబట్టే, తన వెన్నుమీద ఈటెను



గురిచేసి వుంచాడు. ఈ ప్రమాదం నుంచి బయటపడటం ఎలా?

చంద్రవర్మకు ఆ ప్రమాద పరిస్థితుల్లో చప్పున ఒక ఉపాయం తోచింది. అతడు తన నడుమునుంచి వేలాడుతున్న కత్తిని చూపుతూ, "అయ్యా, మీరెవరోగాని, నన్ను గురించి అపోహపడుతున్నట్టున్నది. నేను మీ కొడుకును పట్టుకుపోయిన రాజభటుల్లో వాణ్ణికాదు. మీరు చెప్పే రాజెవరోకూడా నాకు తెలియదు. నా నడుముకు వేలాడుతున్న యీ కత్తిని మీరు తీసుకోండి. మనం యిద్దరం అన్ని సంగతులూ నిదానంగా మాట్లాడుకోవచ్చు," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ మాట ముగించీ ముగించక ముందే, అతడి వెనక నిలబడివున్న వ్యక్తి, కత్తిని చంద్రవర్మనుంచి తీసుకుని, "ఇప్పుడు, వెనుదిరగవచ్చు. ఏదైనా మోసం చేసేందుకు ప్రయత్నించావో, నీకు చావు తప్పదు," అన్నాడు కఠినంగా.

చంద్రవర్మ బతుకుజీవుడా అనుకుని ఒక నిట్టూర్పు విడిచి, వెనక్కు తిరిగి చూశాడు. అతడికి దాదాపు డెబ్భైఏళ్ల వయసు గల వృద్ధు డొకడు కనిపించాడు. అతడి తలా, గడ్డం బాగా తెల్లబడివున్నవి. ముఖం అంతా ముడతలు పడివున్నది. అతడు ఒక చేతులో పెద్ద ఈటె, రెండవ చేతిలో కత్తి పట్టుకుని







చూసి, "నీ మాట తీరూ, నీ దుస్తులూ చూస్తే, నువ్వీ ప్రాంతాలకు కొత్తవాడివిలా కనబడుతున్నావు. నిజంగానే నువ్వు రాజ్యం పోగొట్టుకుని అడవులపాలైనవాడివైతే, నేను నీకు సహాయంచేస్తాను. నువ్వు దానికి ప్రతిగా నాకు సహాయం చేస్తానని వాగ్దానం యివ్వగలవా ?" అని అడిగాడు.

"నానుంచి మీకు ఎలాంటి సహాయం కావాలి ?" అన్నాడు చంద్రవర్మ.

"నా కొడుకును రుద్రపురం రాజైన శివ సింహుడు బంధించి తీసుకుపోయాడు. నేను అతడి భటుల బారి పడకుండా తప్పించు కుంటూ, ఈ అరణ్యంలో తిరుగుతున్నాను. రాజుతో విరోధం పెట్టుకుని, ఈ విధంగా మరెంతో కాలం బతకగలనన్న ఆశ యిక నాకు లేదు. ఈసరికే నా కొడుకును రాజు చంపించివుంటే చేయగలిగిందేమీ లేదు ! అలాకాక అతడు బతికివుంటే, నేను రాజుతో రాజీపడి అతడికి "కంచుకోట" ప్రాంతం వున్న చోటుకు వెళ్లే మార్గాన్ని తెలిపే పటం యివ్వదలుచుకున్నాను," అన్నాడు ముసలివాడు.

"కంచుకోటా ?" అంటూ చంద్రవర్మ ఎక్కడ లేని ఆశ్చర్యం కనబరిచి, "మీరనే కంచుకోట సంగతి నా చిన్నప్పుడు, పెద్ద

నిలబడివున్నాడు. అతడి కళ్లు ఎర్రగా జేవురించివున్నవి.

"నేను రాజభటుణ్ణి కాను. రాజ్యం పోగొట్టుకుని అడవులపాలైన ఒకానొక దేశపు రాజును. మీ కుమారుణ్ణి బంధించి తీసుకు పోయిన రాజెవరు ?" అని అడిగాడు చంద్రవర్మ.

"నువ్వు ఏరాజ్యపు ఎల్లల్లో వున్నావో కూడా నీకు తెలియదా ?" అని అడిగాడు ముసలివాడు అనుమానం కనబరుస్తూ.

చంద్రవర్మ తెలియదన్నట్టు తల అడ్డంగా తిప్పాడు. ముసలివాడు చంద్రవర్మకేసి ఓ నిమిషకాలం గుచ్చిగుచ్చి పరీక్షిస్తున్నట్టు






వాళ్లు చెప్పుకుంటూవుండగా వినేవాణ్ణి. ఆ కంచుకోట పడమటి సముద్రతీరప్రాంతాన ఎక్కడో వున్నదనీ, దానికి వెళ్లే మార్గం తెలిసినవాళ్లెవరూ బతికిలేరనీ వాళ్లనుకుంటూ వుండేవాళ్లు. ఆ చోటుకు చేరేందుకు మార్గం సూచించే పటం మీదగ్గిర వున్నదని వినటం నాకెంతో ఆశ్చర్యం కలిగిస్తున్నది!" అన్నాడు చంద్రవర్మ.

"అవును, ఆశ్చర్యమే!" అంటూ ముసలివాడు తల వంచుకుని ఓ క్షణకాలం ఆలోచిస్తూ వూరుకుని, తరవాత తల ఎత్తి, చంద్రవర్మ ముఖంలోకి సూటిగా చూస్తూ, "ఆ కంచుకోట ఎక్కడ వున్నదో తెలుసుకునేందుకు ప్రయత్నించి, చాలామంది ప్రాణాలు కోల్పోయారు. ఆ సంగతి నీకు తెలుసుగదా?" అన్నాడు.

"అలా అని, పెద్దవాళ్లు చెప్పుకుంటూ వుండగా విన్నాను," అన్నాడు చంద్రవర్మ.

చంద్రవర్మ జవాబు వింటూనే ముసలివాడు నవ్వి, "నీకు కంచుకోటను గురించి సర్వం తెలుసునని నాకు అనుమానం కలుగుతున్నది. నాదగ్గిర ఆ కంచుకోటకు వెళ్లే మార్గం చిత్రించిన పటం ఒకటి వున్నది. దాన్ని మా పూర్వుల్లో ఒకరు సంపాయించారు. దాని సంగతి రుద్రపురం రాజైన శివసింహుడివరకూ పోయింది. అతడు తన భటులను పంపగా నేను పారిపోయి యిటువచ్చాను. నాకొడుకు దేవలుడు అతడికి చిక్కిపోయాడు. కంచుకోటలో లభ్యమయే వెలలేని రత్నరాసుల్లో నాకూ కొంత భాగం యిచ్చేటట్టయితే, ఆ పటాన్ని నేను రాజుగారికి యివ్వగలను. ఇందుకు నువ్వు మధ్యవర్తిగా వుండాలి. దేవలుణ్ణి విడిపించాలి. ఇందుకు సహాయపడేట్టయితే, నాకువచ్చే భాగంలో కొంత నీకిస్తాను. ఆ ధనంతో నువ్వు కావలసిన సైన్యాలను సమకూర్చుకుని, నీ దేశాన్ని తిరిగీ జయించుకోవచ్చు," అన్నాడు ముసలివాడు.





మునలివాడు చెప్పినదంతా శ్రద్ధగా విన్న చంద్రవర్మకు అతడు సామాన్యుడు కాడని తెలిసిపోయింది. ఎత్తులు వేయటంలో, వ్యూహాలు పన్నటంలో అతడు అందెవేసిన చేయి అని చంద్రవర్మ గ్రహించాడు.

"మీరు పెట్టిన నియమాలు నాకు అంగీకారమే. కంచుకోటకు వెళ్లే మార్గాన్ని సూచించే ఆ పటం ఏదో నాకు చూపండి," అన్నాడు చంద్రవర్మ.

ముసలివాడు తృప్తిగా చంద్రవర్మకేసి ఓమారు చూసి, ఏదో జవాబివ్వబోయేంతలో బయట కలకలం వినబడింది. ముసలివాడు ఎగిరి గంతేసి వాకిలిదగ్గిరకు పోయి బయటికి తొంగి చూస్తూ, "అరుగో, రాజుగారి భటులు యిటే వస్తున్నారు! నాకూ, నా కొడుక్కీ ఎటువంటి హానీ కలగదని వాళ్లు మాట యిస్తే నేను వాళ్లను కలుసుకుంటాను. కంచుకోటలో దొరికే ధనంలో నాకివ్వవలసిన భాగం సంగతికూడా నువ్వు వాళ్లతో మాట్లాడి వాగ్దానం తీసుకో!" అంటూ గుడిసె నుంచి బయటికి పరిగెత్తి, అడవిచెట్లలో మాయమయాడు.

తృటికాలంలో జరిగిపోయిన యీ సంఘటన చంద్రవర్మకు నివ్వెరపాటు కలిగించింది. ముసలివాడు అసాధ్యుడు. తనను సునాయాసంగా ప్రమాదంలో తగుల్కొనేట్టు చేసి, అడవిలోకి పారిపోయాడు. ఇప్పుడు తనేం చేయాలి?

చంద్రవర్మ తను ఏం చేయాలో నిశ్చయించుకునే లోపలే, అతడున్న గుడిసెను కత్తులూ, కటార్లూ ధరించిన రాజభటులు చుట్టుముట్టారు.

"లోపల వున్నవాళ్లెవరో బయటికి రండి. పారిపోయేందుకు ప్రయత్నిస్తే.... ఈటెకు గుచ్చి పైకెత్తుతాం!" అంటూ భటులు కేకపెట్టారు. చంద్రవర్మ దేనికైనా తెగించినవాడిలా, నిర్భయంగా గుడిసెలోంచి బయటికి వచ్చాడు. —(ఇంకా వుంది)



# రక్తస్పర్శ: వ్యత్యాసాలు

పట్టు విడవని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, శవాన్ని దించి భుజాన వేసుకుని, యథాప్రకారం మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు పడే కష్టం చూస్తే నాకు చాలా జాలిగా ఉన్నది. నీవు కష్టపడేది ఎవరి కోసం? ఆ మనిషి నీ రక్తబంధువా? నీ తరగతికి చెందినవాడా? రక్తబంధువుల కోసరమైతే త్యాగం చేసినా తప్పు లేదు. ఈ విషయం రుజువు చెయ్యటానికిగాను నీకు ఒక చిన్న కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం కౌశాంబీనగరంలో ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. వారు పేదవారు. అన్న పేరు శంకరదేవుడు, తమ్ముడి పేరు శంభుదేవుడు. ఇద్దరూ చాలా చిన్నవయసునుంచి గొప్పఇంటివాళ్లవద్ద సేవచేసి జీవయాత్ర గడుపుతూ వచ్చారు.

ఇలా ఉండగా శంకరుడు పని చేసే సంపన్నుల కుటుంబంలో ఒక్కడే కుమారుడుండేవాడు. అతనుకూడా శంకరుడి ఈడువాడే. ఇద్దరూ చూడటానికి అన్నదమ్ము లనిపించేటట్టుగా ఉండేవారు. కొంతకాలానికి విధివశాన ఇంటివారి కుర్రవాడు చనిపోయాడు. సంపన్నుడైన ఇంటి యజమాని శంకరుణ్ణి చూసుకుంటూ తన పుత్రశోకాన్ని మరిచిపోయాడు.

అదిమొదలు శంకరుడు ఆ ఇంట నౌకరులాగా ప్రవర్తించటం మాని, సంపన్నుడి కొడుకులాగే పెరిగాడు. వాడికి ఎందులోనూ లోటులేదు. సంపన్నుడి ఆస్తిలో సగం భాగం వాడికి సంక్రమించింది. వాడు బాగా చదువుకుని చివరకు ఉజ్జయిని రాజుగారి వద్ద కొలువుకూడా సంపాదించుకుని గొప్పవాడయాడు.

ఈలోపల శంభుడు మాత్రం నౌకరు జీవితమే గడుపుతున్నాడు. వాడు ఎన్నడూ తన కష్టాలను తలుచుకునేవాడు కాడు. తన అన్న గొప్పతనాన్నే స్మరించుకుని ఆనందించేవాడు. వినేవాళ్లు ఉంటే చాలు తన అన్న కబుర్లు ఎంతసేపైనా చెప్పి పారవశ్యం చెందేవాడు.

"మీ అన్న ఎప్పుడైనా నిన్ను చూడ వస్తూంటాడా?" అని ఎవరైనా అడిగితే,



"అబ్బో, మా అన్నకు ఎన్ని పనులు! రాజుగారికి కొలువు చేయాలా? రాజుగారు ఇక్కడికీ, అక్కడికి వెళ్లమంటే వెళ్లాలా? గొప్ప గొప్ప వాళ్లంతా ఇంటికి వస్తే రాచ కార్యాలు మాట్లాడాలా? అతనికి ఎక్కడ తీరుతుంది? మూడేళ్ల కిందట ఈ పట్టణం వచ్చినప్పుడు నాకు కనబడి మరీ వెళ్లాడుగా!" అనేవాడు శంభుడు.

"మీ అన్న నీకు ఎప్పుడైనా డబ్బు పంపించి సహాయం చేస్తూంటాడా?" అని అడిగితే, "ఎంత చెట్టు కంత గాలి! ఎంత డబ్బూ ఆయనకే చాలదు. అయినా నాబోటి వాడికి డబ్బెందుకూ? నాకు కావలిసిందంతా మా యజమాని ఇస్తూనే ఉన్నాడుగా!" అని శంభుడు సమాధానం చెప్పేవాడు.

వాడికి తన అన్నమీద ఉండే గౌరవాభిమానాలు చూసి కొందరు సంతోషించేవారు, మరికొందరు నవ్వుకుని, వాణ్ణి పిచ్చివాడి కింద జమకట్టేవారు.

ఈ విధంగా చాలాకాలం గడిచింది. శంభుడు పెద్దవాడయాడు. వాడికి వివాహం చేసుకునే వయసు వచ్చింది. వాడికి తగిన వధువుకూడా దొరికింది. కౌశాంబీనగరంలోనే మరొక గొప్పయింటి పిల్ల అయిన మాలతి అనే అమ్మాయికి లక్ష్మి అని ఒక పరిచారిక ఉండేది. లక్ష్మికీ శంభుడికీ పరిచయం



అయింది. ఇద్దరూ పెళ్లాడటానికికూడా నిశ్చయించారు.

పేదవాళ్ల పెళ్లిళ్లు సులువుగా జరగవు. ఈ పెళ్లికి శంభుడి యజమానీ, లక్ష్మి యజమానురాలూకూడా సమ్మతించేసరికి ఒక ఏడాది గడిచింది. ఈ సంగతి నలుగురికీ తెలిసినాక అందరూ సంతోషించారు. అయితే తన అన్నకూడా లక్ష్మిని ఆమోదిస్తేనే గాని శంభుడికి సంతృప్తి లేదు. వాడు శంకరుడికి కబురు చేశాడు.

కబురు అందిన కొంతకాలానికి శంకరుడు కౌశాంబీనగరానికి వచ్చాడు. అయితే అతను తన తమ్ముడు పనిచేసే ఇంటికి రాక అతిథి గృహంలో దిగి, మంచి బట్టలు వేసుకుని తనను చూడరమ్మని నౌకరుచేత శంభుడికి కబురు చేశాడు.

శంభుడు ఆ ప్రకారమే అన్నను చూడబోయి లక్ష్మిని వర్ణించి చెప్పి, "అన్నా, నువుకూడా లక్ష్మిని చూసి నీ అభిప్రాయం చెప్పు. మేము ఈడూ జోడూగా ఉంటామని అందరూ అన్నారుగాని, నీ నోట ఆ మాట వింటే తప్ప నాకు తృప్తిలేదు. ఇవాళే వచ్చి నీకు కనపడమని లక్ష్మికి కబురు చేస్తాను," అన్నాడు.

శంకరుడు సరేనన్నాడు. ఆ రోజు సాయంకాలమే లక్ష్మి, తన యజమానురాలైన



మాలతిని వెంటబెట్టుకుని అతిథి గృహానికి వెళ్లింది. మాలతి చాలా అందగత్తె. ఆమెను చూడగానే శంకరుడు పరవశుడైపోయి, ఆమెకు తన పేరూ, హెూదా మొదలైనవి తెలుపుకుని స్నేహం కలిపాడు. మాలతి వెళ్లిపోతూ శంకరుణ్ణి తమ ఇంటికి అతిథిగా రమ్మని ఆహ్వానించింది. మర్నాడు ఉదయమే శంకరుడు వారింటికి వెళ్లి, మాలతి తండ్రిని కలుసుకుని, తనకు మాలతిని పెళ్లాడాలని ఉన్నట్టు చెప్పాడు. మాలతి తండ్రి పెళ్లికి సమ్మతించాడుకూడా.

ఇది జరిగిన సాయంకాలం శంభుడు గంపెడు ఆశతో శంకరుడి వద్దకు వచ్చి, "అన్నా, లక్ష్మిని చూశావా? ఎలా ఉంది? నీ కంటికి నచ్చిందా?" అని అడిగాడు.

"ఆ లక్ష్మి యజమానురాలు అంత అందగత్తె అని నాకు మాటమాత్రమైనా చెప్పావుకావేం?" అని శంకరుడు తమ్ముణ్ణి అడిగాడు.

"ఎందుచేతోగాని నేను ఆవిడ మొహం ఎన్నడూ సరిగా చూడలేదు. ఇంతకూ లక్ష్మి నీకు నచ్చిందని చెబుదూ!" అని శంభుడు ప్రాధేయపడ్డాడు.

"నువ్వేమీ అనుకోకు. నేను లక్ష్మిని చూడటం మాటే మరిచాను. ఇంతకూ ఆ లక్ష్మిని నువు పెళ్లాడే అవకాశం లేదు. ఎందు



శంపే. నాకూ మాలతికీ పెళ్లి స్థిరమై పోయింది. లక్ష్మి మాలతి వెంట ఉజ్జయినికి వచ్చేస్తుంది. నువు లక్ష్మిని పెళ్లాడితే మా ఇంటనే నౌకరులాగా బతకవలిసి వస్తుంది. ఇది భావ్యంగా ఉండదు. అందుచేత నువు మరొకతెను చూసుకుని పెళ్లాడు. ఈ ఊళ్లో పరిచారికలు చాలామంది ఉంటారు!" అన్నాడు శంకరుడు.

తన అన్న చెప్పిన ఈ మాటలు విని శంభుడు నిలువునా కుంగిపోయాడు. అతడికి ఏంచెయ్యాలో తెలియలేదు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, శంకరుడూ శంభుడూ రక్తస్పర్శచేత అన్నదమ్ములు, కాని వారిలో జీవితం వ్యత్యాసాలు కల్పించింది. అలాటప్పుడు శంభుడు తనకూ శంకరుడికీ ఉండే రక్తస్పర్శను పాటించి అన్నకోసం సంతోషంతో తన ప్రేమను త్యాగంచెయ్యాలా? లేక అతన్ని ఇంకొక తరగతివాడుగా భావించి తన సుఖాన్ని తాను చూసుకోవాలా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రక్తస్పర్శ జన్మతః వచ్చేది. వ్యత్యాసాలు జీవితమార్గాలలో తేడావల్ల ఏర్పడుతవి. శంకరుడి సుఖానికి శంభుడి సుఖం అడ్డం వచ్చినది వారు అన్నదమ్ములు కావటంవల్ల అని శంకరుడు అనుకున్నాడు. అయితే ఇది నిజంకాదు. వారిద్దరూ వేరువేరు తరగతులకు చేరి పోవటంచేత యజమానురాలినీ, పరిచారికనూ ప్రేమించటం జరిగింది. అందుచేత శంభుడు తన అన్నపట్ల గల రక్తస్పర్శను పాటించ నవసరంలేదు. అతను తన వదినెగారి సేవకురాలిని నిశ్చింతగా పెళ్లాడవచ్చు," అని జవాబు చెప్పాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# బాలీశుడి పరాభవం

పూర్వం దండకారణ్యం మధ్య పర్వత ప్రాంతంలో మారీచలోయ అని ఉండేది. ఆ లోయనిండా గుట్టలుండేవి. ఒక్కొక్క గుట్టపైనా ఒక్కొక్క రాకీసుడు ఇల్లు కట్టుకుని నివసిస్తూ ఉండేవాడు. రాకీసులలో కెల్లా బలశాలి అయినవాడు రాకీసులకు నాయకుడుగా ఉంటూండేవాడు. రాకీసు లంతా సామాన్యంగా కలిసికట్టుగానే జీవించేవారు. కాని ఒక్కొక్కప్పుడు ఒక యువక రాకీసుడు తాను చాలా బలశాలి ననుకుని మిగిలిన రాకీసులను యుద్ధానికి పిలిచి, వాళ్లను ఒక్కొక్కరినే జయించి తాను నాయకుడు కావటంకూడా జరుగుతూ ఉండేది.

బాలీశుడనే రాకీసుడు అపారమైన బలం గలవాడు. వాడు మారీచలోయలో ఉండే ఒక్కొక్క రాకీసుణ్ణే తనతో పోటీకి పిలిచి ఓడించ నారంభించాడు.

"నువు మమ్మల్నందర్నీ ఓడించటం ఒక లెక్కలోది కాదు. పెద్ద గుట్టపైన ఉండే శతబాహును ఓడించు!" అన్నారు రాకీసులు బాలీశుడితో.

"ఎప్పుడో వీలు చూసుకుని ఆయన దర్శనంకూడా చేస్తాను!" అని బాలీశుడు అంటూ వచ్చాడు.

అలాగే శతబాహుడితోకూడా అనేకమంది రాకీసులు, "ఎప్పుడో బాలీశుడు నిన్నుకూడా ఒక పట్టుపట్టి చూస్తాడు. అతణ్ణి జయించటం ఏమంత సులువు కాదు!" అన్నారు.

"నేనూ బాలీశుడికోసమే ఎదురు చూస్తున్నాను!" అన్నాడు శతబాహుడు బింకంగా. అయితే బాలీశుడు తనను ఓడించేస్తాడేమోనన్న భయం శతబాహుడికి లేకపోలేదు.

మారీచలోయకు ఒక చివర బాలీశుడూ, ఇంకొక చివర శతబాహుడూ ఉండటంవల్ల

పి. వెంకటేశ్వర్లు



వారిద్దరూ కలుసుకోవటంగాని, ఒకరినొకరు పరిచయం చేసుకోవటంగాని చాలాకాలం పడలేదు.

ఒకనాడు శతబాహుడూ, ఇతర రాక్షసులూ కలిసి రెండు కొండల మధ్యగా బండరాళ్లతో దారి వేస్తున్నారు. తనతో బలాబలాలు చూసుకోవటానికి బాలీశుడు అక్కడికి రాబోతున్నట్టు శతబాహుడికి అనుమానం తగిలింది. వాడు తన చేతిలో ఉన్న కొండ రాయి విసిరి అవతలికి గిరవాటు వేసి, "ఒక్కసారి ఇంటిదాకా వెళ్లి నా భార్య ఎట్లా ఉన్నదీ చూసి ఇప్పుడే వస్తాను," అంటూ బయలుదేరాడు. వాడు దారి పక్కన ఉన్న చెట్టొకటి పీకి, వేళ్లూ, కొమ్మలూ తుంచేసి, చేతికర్రలాగా చేసుకుని ఇంటికి చేరుకున్నాడు.

శతబాహుడి భార్య తన భర్త త్వరగా ఇంటికి వచ్చినందుకు మొదట సంతోషించినా, అతడి ముఖాన ఏదో విచారం ఉండటం గమనించి కారణ మడిగింది.

"వేరే కారణ మేముందీ? ఈ బాలీశుడే. వాణ్ణిగురించి ఎవరి నోట విన్నా భయంకరమైన విషయాలే! వాడు కాలితో గట్టిగా నేలను తాటిస్తే భూకంపం వస్తుందిట! వాడు పిడుగులను పట్టి రెండు చేతుల మధ్యా అదిమి అప్పడాలలాగా చేస్తాట్ట!" అంటూ శతబాహుడు తన బొటనవేలు నోట పెట్టుకున్నాడు. ఎందుకంటే వాడి మాయలన్నీ ఆ బొటనవేలిలో ఉన్నాయి. దాన్ని నోట పెట్టుకుంటే వాడికి ఎక్కడ ఏమి జరిగేదీ తెలుస్తుంది.

"ఏమి తెలిసింది?" అన్నది శతబాహుడి భార్య.

"వాడిప్పుడు మన ఇంటికే వస్తున్నాడు. రేపు మధ్యాన్నానికల్లా ఇక్కడికి చేరుకుంటాడు," అన్నాడు శతబాహుడు.

"ఫరవాలేదు. వాడి సంగతి నేను చూస్తాలే. భయపడకు!" అన్నది భార్య.

ఆమె ఆ సాయంకాలమే చుట్టుపక్కల ఉన్న రాక్షసులందరి ఇళ్ళకూ వెళ్ళి బోలెడన్ని ఇనపపెనాలు అరువు తెచ్చింది.

తమ అతిథికి రొట్టెలు తయారు చెయ్యటానికిగాను రెండు గుండిగల నిండా పిండి సిద్ధం చేసింది.

బాలీశుడు వచ్చి చేరే సమయానికి ఆమె తన భర్తను ఒక పెద్ద తొట్టెలో పడుకోబెట్టి అతడిపైన గుడ్డలు కప్పింది. తరవాత ఆమె తాను అరువు తెచ్చిన పెనాలు మధ్య ఉంచి, వాటికి పైనా కిందా పిండి పట్టించి రొట్టెల లాగా తయారుచేసి వాటిని కాల్చసాగింది. ఇంతలో బాలీశుడు అక్కడికి వచ్చాడు.

"ఈ ఇంటికి శుభం కలగాలి! శతబాహుడి ఇల్లు ఇదేనా, అమ్మా?" అని అడిగాడు.

"అవును, నాయనా, కూర్చో! నువ్వెవరో గాని ఆయన లేని సమయంలో వచ్చావు. ఎవడో బాలీశుడని ఒక పొగరుబోతు తనతో ఖలాబలాలు చూసుకునేటందుకు వస్తున్నాడని విని చిందులు తొక్కుతూ మా ఆయన కొండల మధ్య దారి వేస్తున్న చోటికి వెళ్లాడు! పాపం, వాడెవడికో మూడిందన్నమాటే!" అన్నది శతబాహుడి భార్య.

"అట్లాగా? నేనే ఆ బాలీశుణ్ణి! ఆయనో నేనో తేల్చుకోవాలని ఏడాదిగా ఎదురు చూస్తున్నాను!" అన్నాడు బాలీశుడు.



"నీకు ఆయన ముఖ పరిచయం అన్నా ఉన్నదా?" అని ఆమె అడిగింది.

"ఏదీ? ఆయన నా ఎదట పడకుండా తిరుగుతున్నాడాయె!" అన్నాడు బాలీశుడు.

"అంతవరకు అదృష్టవంతుడివనుకో!.... ఇదుగో, చూడు, నాయనా! మరీ ఎదురు గాలిగా ఉందిగాని, ఇంటిని కాస్త తిప్పు తావా? ఆయన ఉంటే అదే చేస్తాడు!" అన్నది శతబాహుడి భార్య.

ఈ మాట విని బాలీశుడు లోలోపల నివ్వెరపోయాడు. కాని ఆ ఆశ్చర్యం పైకి చూపలేదు. వాడు లేచి బయటికి వెళ్లి, తన కుడిచేతి మధ్యవేలు మెటికలు విరిచి, రెండు చేతులా ఇంటని పట్టుకుని తిప్పేశాడు. బాలీశుడి రాకస శక్తులన్నీ వాడి కుడిచేతి మధ్య వేలిలో ఉన్నాయి మరి!

బాలీశుడు తన ఇంటిని తిప్పెయ్యటం చూసి తొట్టెలో పడుకుని ఉన్న శతబాహుడికి ముచ్చెమటలు పోశాయి. అతడి భార్య మాత్రం కొంచెమైనా ఆశ్చర్యం ప్రదర్శించక, "బాగుంది, నాయనా! ఆ చేత్తనే దొడ్లో ఉన్న కొండను చీల్చి నీళ్లబావి ఏర్పాటు చేస్తావా ఏమిటి? నా భర్త నీళ్లకోసం కొండను చీల్చబోతుండగా ఎవరో వచ్చి నీమాట చెప్పారు. నీ పేరు వినగానే రోషం వచ్చి ఉన్నవాడు ఉన్నట్టుగా బయలుదేరి



వెళ్లిపోయాడు! ఈ పూట తాగటానికైనా నీళ్లు లేవు!" అన్నది.

బాలీశుడు ఆమెవెంట దొడ్లోకి వెళ్లి రాతిని చూశాడు. అది నూరు నిలువుల ఎత్తుగల రాయి. అయినా బాలీశుడు వెనకాడక, తన కుడిచేతి మధ్యవేలు మెటికలు విరిచి రెండు చేతులతోనూ ఆ కొండను రెండుగా పగల దీశాడు. కొండ నిలువుగా పగిలి మధ్య ఒక బ్రహ్మాండమైన కోన ఏర్పడింది.

"రా, బాబూ! కష్టపడ్డావు, ఇంత తిండి పెడతాను! ఏం తిండిలే, మాది చాలా మొరటు తిండి! మా ఆయనకోసం రొట్టెలు చేస్తున్నాను. నీకు కావలిసినవి నువ్వు తిను, ఆయన వచ్చేలోగా మరిన్ని చేస్తాను," అన్నది శతబాహుడి భార్య. ఆమె బాలీశుణ్ణి కూర్చోబెట్టి ఎదురుగా పది రొట్టెలు దొంతరగా పేర్చి పెట్టింది.

బాలీశుడు పైరొట్టె తీసి నోటపెట్టి కొరికాడు. మరుక్షణం వాడి పళ్లు రెండు పెళ్లున విరిగాయి; వాడు భయంకరంగా ఆర్తనాదం చేశాడు.

"ఛీ, ఛీ! ఇదేం రొట్టె? నా పళ్లు ఎలా ఊడాయో!" అన్నాడు బాలీశుడు.

"అదేమిటి, నాయనా? మా ఆయన రోజూ తినే రొట్టెలేనే! మాది కాస్త మొరటు తిండి అని ముందే చెప్పానుగా. అయినా



ఈ రొట్టెలను ఆ తొట్లోఉన్న పిల్లాడుకూడా తింటాడే!" అన్నది శతబాహుడి భార్య.

బాలీశుడికి రోషం వచ్చి ఇంకొక రొట్టె తీసి కొరికాడు. వాడి దంతాలు మరిరెండు ఊడాయి. "ఛీ, ఛీ! ఇదేం తిండి! నాకు వద్దేవద్దు!" అని వాడు అరిచాడు.

"ఆ రొట్టెలు తినటానికి శక్తి లేకపోతే మానెయ్యిగాని, కేకలు పెట్టకు. నిద్ర పోతున్న బిడ్డడు కాస్తా లేస్తాడు. అడుగో, లేపనే లేచాడు!" అన్నది శతబాహుడి భార్య.

ఈలోపల శతబాహుడు చిన్న శోకం పెట్టాడు. చిన్న పిల్లవాడి గొంతు అలా ఉండటంచూసి బాలీశుడు దిగ్భ్రమ చెందాడు. శతబాహుడి భార్య పొయివద్ద నుంచి లేచి వెళ్లి, తొట్టెలో ఉన్న తన భర్తకు మామూలుగా చేసిన రొట్టె ఒకటి ఇచ్చింది. తొట్టెలో ఉండే పసివాడు ఆ రొట్టెను గబగబా కొరికి తింటూఉండటం చూసి బాలీశుడు, "ఇంకా నయం! నేనిక్కడికి శతబాహుడుండగా వచ్చానుకాదు!" అనుకున్నాడు. భయంతో వాడికి కాళ్లూ, చేతులూ వణకసాగాయి.

"అమ్మా, శతబాహుడు వస్తే నేను క్షమాపణ చెప్పుకున్నానని చెప్పు! అయన ఎక్కడ, నేనెక్కడ! నాకు బుద్ధివచ్చింది!" అన్నాడు వాడు శతబాహుడి భార్యతో.

"అసలా మనుషుల తీరే వేరు, నాయనా! మా అబ్బాయి దంతాలు తడివి చూశావంటే నీకే తెలుస్తుంది! ఏది, నాయనా, నోరు తెరిచి నీ దంతాలు మా మయ్యకు చూపించూ!" అన్నది శతబాహుడి భార్య.

బాలీశుడు మోసపోయి, శతబాహుడి నోట్లో తన కుడిచేతివేళ్లు పెట్టి తడిమాడు. వీలుచూసుకుని శతబాహుడు వాడి మధ్య వేలు కాస్తా కొరికేశాడు. ఆ వేలితోబాటు బాలీశుడి శక్తులన్నీ పోయి వాడు మామూలు మనిషి అయిపోయాడు. ఆ తరవాత శతబాహుడిమీదికి పోటీవచ్చిన రాక్షసుడే లేడు.





# అసమీక్ష్యకారిత్వము

సుపర్ణసిద్ధి :

నిజము నీ మాట ఎం-తే అశవలన
ప్రజ కష్ట నష్టముల్ - పడుచుందు రెపుడు.
ఒక రాచనగరున - నొక కోతిమూక
సుకముండు రాకుమా-రకు లిచ్చు తిండ్ల.
నగరున పొట్టేళ్లు - తెగ క్రొవ్వియుండు
తగ రొక్కటి దినమ్ము - తడవు వంటలను
వంటవా రది చూచి - కంటగించుచును
ఇంట నుండిన దెత్తి - ఇట్టె కొట్టెదరు.
దినదినమ్మి రచ్చ - కొనసాగుచుండె
కననట్లు కోతులు - గడచుచు నుండె.
కోతిరా జిది చూచి - "కొంపలో నిట్లు
రాతిరి పవల్లెల్ల - రచ్చలు కలుగ
ఉండరా ; దిట నేమి - యొనగూడగలదొ ?
మిండ పొట్టేలేమి - మెడకు తేగలవొ ?"
అని తనవారల - నడవికి పోద
మని ప్రోత్సహించె ; వా - రది వినలేదు.

రాజభోజన మిట - రాము పొమ్మనిరి.
ఈ జగడాలలో - నేల కూర్చుంట
ముప్పు తప్పదటంచు - ముసలి ఆ కోతి
చెప్పిన వినకున్న - చెడుదు రటంచు
తనవారి ముప్పును - తను చూడలేక
వనమున కేగె, అం-తన ఒకనాడు—
వంటింట పొట్టేలు - వంగుట చూచి
వంటవా డొక కొర్వి - వడి విసరంగ,
భగభగ మండె నా-తగరు వెంట్రుకలు
రగులుచు అశ్వశా-లను దూరె నదియు.
కస పంటుకొని కొంప - గబగబ మండె.
పస చెడె గుఱ్ఱాలు ; - ప్రభువు వైద్యులను
రావించి అడుగ, "దొరా కోతి మెదడు
ఈ వేడి తగ్గించు - నిపుడె" అన్నారు.
అన భటు లంత చి-క్కిన కోతినెల్ల
పనిపట్టి చంపి, రా - పగిది, వనాన
కోతిపెద్ద యొఱింగి - గోలున నేడ్చె

విద్వాన్ విశ్వం




కోతుల జంపిన - కొండెరాజునకు
బుద్ధి సెప్పదలంచి, - పొగులుచు నడవి
ఉద్ధతి తిరుగగా, - నొక కుంట గాంచె.
అందులోనికి వెళ్ళు - అడుగుల జాడ
అందుండి తిరిగి రా-నట్లు కాన్పింప
తామరతూడుతో - దాహమ్ము త్రావె
ఈమాడ్కి చూచి క-న్పించె రాకసుడు.
" ఈ సరస్సున నుందు - నెప్పుడు, దిగిన
మానుల తిందు ; నీ-మతికి మెచ్చితిని "
అని వాడు మెచ్చ ; " అయ్యా నీకు తిండి
ఒనగూర్తు నీమెడ-నుందు రత్నాల
హారమ్ము ని"మ్మని - ఆ కోతి కోరె.
హారమ్ము గొని మెల్ల - ఊరును జేరె.

అది చూచి జన మెల్ల - ఆ హార మెట్లు
ఎద దాల్చితని దాని - నెంతేని అడుగ
" కల దొక్క కొల, నందు - కలవు హారాలు
తలకొక్క టిత్తు నం-దుల పత్తురేని "
అని కోతి చెప్ప రా - జది విని ఆశ
తన పరివారమ్ము - గొని తోడ వచ్చె.
తెలవారుచుండ నం-దుల దిగినంత
వెలలేని హారాలు - వేలు చిక్కునన
పరివార మంతయు - ఉరికిరి లోన
తిరిగి రాకున్న ఆ-దొర కోతి నడిగె.
కోతి యిట్లనె : "మాదు - కొంప ముంచితివి.
ఈ తీరుగా నిన్ను - నేను ముంచితిని.
పో"మ్మనె ; రాజంత - బుద్ధి చెప్పుకొని
కిమ్మనకుండ దా-రమ్మట పోయె.

* * *

అత్యాశ మంచి గా - దన్న అందులనె
సత్యమ్ము, సత్యమ్ము - సత్య మీ మాట.

చక్రధారి :

తప్పయ్యె గాని నన్ - తటుకున ద్రోసి
ఇప్పుగిదిని పోవ - నెటు మనసయ్యె
నను వీడిపోకు మీ-పని దిక్కులేక
కసరాని బాధల - గడపంగలేను.
ఏమైన దైవమే - యేరీతి నడపు
నా మార్గమున శుభ-మ్మశుభమ్ము నగును.

సువర్ణసిద్ధి :

అయినను మన చేత - నగునంతవఱకు
నయవాక్యముల విన-నగు నెవ్వఱకును.
వినకుండ చెడితివి ; - ననుగూడ నిచట
కనరాని యిడుమల - దినుమను టేల ?

* * *

విను మొక్క వనమున - చను నొక పక్షి
తనకు రెండు ముఖాలు - తనువేమొ ఒకటె.
ఒకనాడు ఒక ముఖ - మ్మొక పండు తినుచు
ఇకిలించి ఇకిలించి - ఎంతొ వర్ణించె.
అవలి ముఖమది - యంతయు చూచి
ఈవలి కింతైన - ఇమ్మని యడిగె.
" ఎందుకోయీ నీకు, - ఇటు తినుచుంటి
ఎందైన నొక పొట్ట-కే గద పోవు,"
అనిన నా ముఖము దీ-నానతమ్మయ్యొ
చనె కొన్నినాళ్ళు ; ఒక్క - సమయమ్ము
నందు—
విసపు పండొకటి ఆ-వేపు ముఖమ్ము
కనిదీర చూచి త-క్కక తిననుండె.
ఇటు ముఖ మ్మెంతయో - ఏడ్చి మ్రొక్కినను
కటు భాషియై యది - కసకస నమలె.
రెండును పడి చచ్చె - ఒండేమి లేక

* * *

అండజమ్ముల కథ - అగు మన తీరు
నేనుండ నిచ్చట, - నే నేగువాడ
కానిమ్ము విధి ; నన్ను - క్రమ్మ అనిమ్ము.



చక్రధారి :

సరె పోయి రమ్మోయి - జరుగనీ ఎట్లొ
మఱి ఒంటరిగ బోకు - మంచిది కాదు.
జంటగా దారిని - చనవలె నెపుడు

సువర్ణసిద్ధి :

జంట రెండులకు ఆ-సందర్భమేమి ?

చక్రధారి :

విను మొక్క కథ చెప్పె-దను వివరింప
మునుపొక్క ఊర నుం-డెను విప్రు డొకడు.
పనిమీద పోదలం-చెను పొరుగూరు
తన తల్లితో చెప్ప - జనని యిట్లనియె
" తోడు తీసుకపొమ్ము - వేడుక యంచు
వాడల కొంటిగా - వలదు పోవంగ.

ఎవరు లేకున్న ని-దే చాలు" నంచు
అవతలి గుంటలో - నటు చూచి ఎంఁడ్రి
నొకదాని దెచ్చి వా-నికి ఆమె యిచ్చె,
ఇక విధిలేక తీ-సుక బుట్టలోన
ఉంచి, దానిని గొంచు - నొక చెట్టుక్రింద
మంచి యెండగుటయు, - మఱి కూర్కు-
సెందె.

చెట్టుతొఱ్ఱను వీడి - చెనటి పామొకటి
గుట్టుగా దిగివచ్చి - బుట్టను జూచె.
లోనికి తల వెట్ట, - పూనిక యెంఁడ్రి
దానిని కత్తుల - బోనులౌ కొండి
యుల బట్టి, తల నొక్కి - యసువుల బాపె.
కలవడి విప్రుడు - తల విదిలించి
మేల్కాంచి చచ్చిన - మిడినాగు చూచి
కోల్కొని తన యెంఁడ్రి - గుణము కీర్తించె.
జనని మాటను త్రోసి - చరచర రాక
వినినందుననెకదా - మనితి నం చనియె.

అటుగాన తోడు నె-చ్చటొ చూచుకొనుము
దిటవుగా పొమ్ము పొం-దెదవు సౌఖ్యములు

సువర్ణసిద్ధి :

సరి, పోయివత్తు నా-జ్ఞను సెలవిమ్ము

చక్రధారి :

సరి పోయిరమ్ము గ్ర-మ్మఱ పొందు సుఖము

*　　　*　　　*

అని చక్రధారి పొ-మ్మనినంత నతడు
పని విని ఊరికి - పయనమైపోయె.

*　　　*　　　*

కావున అత్యాశ - కాదనుచుంఁద్రు
ఏవి లభింప న-వే చాలునంచు
మనవలె వేనికో - మఱి చూడరాదు
అనుటకై ఈ తంత్ర-మును చెప్పె విష్ణు
శర్మ రాజకుమార-సమితికి నిట్లు
శర్మద; మిందుతో - సంపూర్ణముగను
పంచతంత్రము సమా-ప్తమ్మయ్యె నిపుడు.
కొంచక చదివి పె-క్కులు నేర్చుకొనుడు.

★ పంచతంత్రం సర్వం సంపూర్ణం ★





# డెన్మార్క్ యువరాజు

పూర్వం డెన్మార్క్ దేశాన్ని ఏలే రాజుకు హామ్లెట్ అనే కుమారుడూ, క్లాడియస్ అనే తమ్ముడూ ఉండేవారు. రాజు ఎంతో ఉదారుడు, పరాక్రమవంతుడు, దైవాంశ సంభూతుడు. కాని ఆయన తమ్ముడైన క్లాడియస్ మటుకు పరమనీచుడు, కళా హీనుడు, రాకిసాంశ గలవాడు.

ఒకనాడు రాజుగారు ఉద్యానంలో పడుకుని నిద్రపోతూండగా క్లాడియస్ ఒంటరిగా అక్కడికి వెళ్లి అన్నగారి చెవిలో విషం పోశాడు. దాని ఫలితంగా రాజు చనిపోయాడు. తన అన్నగారు విషసర్పం కరిచి మరణించినట్టు క్లాడియస్ ప్రకటించాడు. ఆ మాట అందరూ నమ్మారు.

ఆచారం ప్రకారం క్లాడియస్‌కు రాజ్యాభిషేకం జరిగింది. క్లాడియస్ కేవలం రాజ్యం కోసమే తన అన్నను చంపలేదు, తన వదినెగారిని పెళ్లాడే దురుద్దేశంకూడా అతనికి ఉన్నది. ఈ కోరికకూడా నెరవేరింది. భర్త పోయి రెండు నెలలు తిరగకుండానే రాణి తన మరిదిని పెళ్లాడి మళ్లీ రాణిఅయింది.

అప్పటికి హామ్లెట్ యుక్తవయసు వచ్చినవాడే. అతను తన తండ్రి పొందిన అకాల మరణానికే కుమిలి పోతూంటే, తన తల్లి పెళ్లితో అతనికి, మూలిగే నక్కపై తాటి పండు పడ్డట్టయింది.

హామ్లెట్ తన తల్లి దండ్రులపట్ల ఎంతో ప్రేమాభిమానాలు గలవాడు. అటువంటి వాడికి భార్యగా ఉండిన తన తల్లి ఇటువంటి వాణ్ణి ఎలా పెళ్లాడిందో అతను ఊహించలేక చాలా బాధపడ్డాడు. అతను తన మనోవేదనను హొరేషియస్ అనే ప్రాణమిత్రుడికి ఒకడికి మాత్రమే చెప్పుతున్నాడు.

ఈ స్థితిలో హామ్లెట్‌కు ఒక వింత విషయం తెలిసింది. కోట వెలపల రాత్రివేళ పహరా ఇచ్చేవారు, అర్ధరాత్రికీ తొలికోడికీ

విలియం షేక్స్పియర్




మధ్యకాలంలో వరసగా రెండు రోజులపాటు చనిపోయిన రాజుగారిని చూశారు. ఈ సంగతి విని హొరేషియస్ మూడవ రాత్రి తానుకూడా పహరావాళ్లవెంట ఉన్నాడు. మామూలు ప్రకారం దయ్యం కనిపించింది. హొరేషియస్ దయ్యాన్ని పలకరించి ప్రశ్నించాడు, కాని అది సమాధానం చెప్పకుండానే వెళ్లిపోయింది.

హొరేషియస్ ఈ సంగతి హామ్లెట్ యువరాజుకు చెప్పాడు. నాలుగోరోజు రాత్రి హామ్లెట్ తన స్నేహితుడితోసహా కోట వెలపలికి వెళ్లాడు. మళ్లీ అర్ధరాత్రివేళ దయ్యం వచ్చింది. అది హామ్లెట్‌ను తనవెంట రమ్మని సైగ చేసింది. తన మిత్రుడూ పహరావాడూ ఎంత చెప్పినా వినక హామ్లెట్ ఆ దయ్యం వెంట వెళ్లాడు.

దయ్యం యువరాజును ఒక ఏకాంత ప్రదేశానికి తీసుకుపోయి, "నాయనా, నేను నీ తండ్రిని. నేను తోటలో పడుకుని ఉంటే నన్ను పాము కరిచిందని అందరూ అనుకుంటున్నారు. నన్ను కరిచిన పాము నా సింహాసనంమీద కూచుని ఉన్నది! నీచుడైన నీ పినతండ్రి నా చెవిలో విషంపోసి నన్ను హత్య చేయటమే గాక మీ అమ్మను కూడా తన మాయలో వేసుకున్నాడు. ఈ హత్యకు నువు ప్రతిక్రియ చెయ్యాలి. మీ అమ్మను ఏమీ అనకు. దాని కర్మన దాన్ని వెళ్లనీ!" అని హెచ్చరించి అదృశ్యమైపోయింది.

ఈ విషయాలు వినగానే హామ్లెట్ మనసు వికలమైపోయింది. అతను తన పినతండ్రిపై పగ తీర్చుకునేదాకా మతి చలించినవాడిలాగా నటించ నిశ్చయించుకుని ఆ సంగతి ముందుగానే తన మిత్రుడితో చెప్పేశాడు. తన తండ్రి దయ్యమై కనిపించిన విషయం కూడా ఎవరికీ చెప్పమని హొరేషియోచేతా, పహరావాడిచేతా ప్రమాణాలు తీసుకున్నాడు. అది మొదలు హామ్లెట్ అందరితోనూ



మతిచెడినవాడులాగా మాట్లాడుతూ వెర్రిగా ప్రవర్తించసాగాడు. పొలోనియస్ అనే మంత్రికి ఒఫీలియా అనే కుమార్తె ఉన్నది. హామ్లెట్ ఆమెను ఎంతగానో ప్రేమించి ఉన్నాడు. వారిద్దరికీ వివాహం జరిగేలాగు కూడా కనబడింది. హామ్లెట్ ఇప్పుడు ఒఫీలియాదగ్గిరకూడా వెర్రివాడులాగే నటించసాగాడు.

హామ్లెట్ మతి చెడటానికి కారణమేమిటో క్లాడియస్ రాజుకు అంతు చిక్కలేదు. అచ్చగా తన తండ్రి చావుగురించే అతనికి మతిపోయిందని ఆయన నమ్మలేక పోయాడు. అసలు కారణమేమిటో ఆరా తీయమని ఆయన హామ్లెట్ వద్దకు ఇద్దరు మనుషులను పంపకం చేశాడు.

హామ్లెట్‌కు మతిపోవటం అతని తల్లిని కూడా చాలా బాధించింది. ఆమెకూడా తన భర్తతోబాటు ఈ పిచ్చికి కారణం ఊహించ లేక బాధపడింది. పొలోనియస్‌ను అడిగితే, "యువరాజు పిచ్చికి కారణమేమిటో నాకు బాగా తెలుసును. అతను నా కుమార్తెను ప్రేమించాడు. ప్రేమ పిచ్చిలోకి దిగింది. అంతకంటె మరేమీ లేదు," అన్నాడు.

ఈ మాటలు విని రాణి "ఇదే అయితే భయం లేదు!" అని సంతోషించింది. తాను




చెప్పినది నిజమని రుజువుచేయటానికిగాను పొలోనియస్ ఒకచోట రాజునూ, రాణినీ రహస్యంగా ఉంచి హామ్లెట్‌కూ తన కుమార్తెకూ సమావేశం ఏర్పాటు చేశాడు. హామ్లెట్ ఒఫీలియాతో తన పిచ్చిధోరణిలోనే మాట్లాడాడు. అతని సంభాషణను విన్నాక రాజు క్లాడియస్‌కు అతని పిచ్చి ప్రేమపిచ్చి అన్న నమ్మకం కుదరలేదు. క్లాడియస్ నియోగించిన మనుషులుకూడా హామ్లెట్‌తో మాట్లాడి అతని హృదయాన్ని తొలిచే రహస్యం ఏమిటో తెలుసుకోలేకపోయారు.

ఈ సమయంలో రాజభవనానికి ఒక నటకుల బృందం వచ్చింది. వారు వెనక



ఒకసారి వచ్చి నాటకాలాడారు. హామ్లెట్ వారిని బాగా ఎరుగును. అతని కిప్పుడు వారిని చూడగానే ఒక ఆలోచన తట్టింది. తన పినతండ్రి తన తండ్రిని నిజంగా హత్య చేసినదీ లేనిదీ ఈ నాటకాలవాళ్ల సహాయంతో తేల్చుకుందామనుకున్నాడు. దయ్యం తనతో చెప్పిన మాటలు నిజం కావచ్చు, కల్పన కావచ్చు. దయ్యాలు ఏ రూపమైనా ధరిస్తాయి; అది తన తండ్రి దయ్యమేననుకోవటానికికూడా హామ్లెట్‌కు తగిన ఆధారం లేదు.

తన పినతండ్రి హంతకుడవటానికి మరింత రూఢిసాక్ష్యం ఉంటే తాను నిశ్చింతగా పగ తీర్చుకోవచ్చునని హామ్లెట్‌కు తోచింది.

అతను నటకులను ఏకాంతంగా కలుసుకుని, "మీరు ఫలాని నాటకం ఆడగలరా ?" అని అడిగాడు. ఆ నాటకంలోకూడా ఒక దుర్మార్గుడు ఒక రాజును చంపి ఆయన భార్యను పెళ్లాడతాడు. ఆ నాటకాన్ని కొద్దిగా మార్చితే అచ్చగా తన తలిదండ్రుల కథే అవుతుంది. నటకులు తమకా నాటకం వచ్చుననీ, అందులో యువరాజుగారు కోరిన మార్పులుచేసి ఆడగలమనీ అన్నారు. నాటకంలో చేయవలిసిన మార్పులేవో హామ్లెట్ వారికి చెప్పాడు.



నాటకం చూడటానికి రాజూ, రాణీ, పొలోనియస్, ఒఫీలియా మొదలైనవారంతా వచ్చారు. హామ్లెట్ తన పినతండ్రి మొహాన్ని పరిశీలించటానికి వీలుగా కూచున్నాడు. నాటకం ప్రారంభమయింది. మొట్టమొదటగా ఒక రాజూ, రాణీ రంగంమీదికి వచ్చారు. వారిద్దరూ మాట్లాడుకోవటంలో రాణీ రాజుతో తాను అతన్ని ఎంతో ప్రేమిస్తున్నాననీ, అతను చనిపోతే మరొకర్ని పెళ్ళాడననీ, భర్తలను చంపే స్త్రీలే అలా మరొకరిని పెళ్ళాడతారనీ అన్నది. ఇది విని క్లాడియస్ చేదుమందు తాగినవాడిలాగా ముఖంపెట్టాడు. తరవాత రాణీ రంగంమీది నుంచి వెళ్ళిపోయింది. రాజు విశ్రాంతికోసం పడుకున్నాడు. తరవాత హంతకుడు అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి రాజు చెవిలో విషం పోశాడు.

ఇది చూస్తూనే క్లాడియస్‌కు శివమెత్తింది. "దీపాలెక్కడ? నేను వెళ్ళిపోవాలి!" అంటూ ఆయన లేచి మిగిలినవారందరినీ వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు. నాటకం నడిమధ్యలో ఆగిపోయింది.

కాని హామ్లెట్ కోరిన రుజువు దొరికింది. తన పినతండ్రి నిజంగా హంతకుడే. దయ్యం చెప్పిన మాటలలో ఆవగింజంతయినా అబద్ధం లేదు. ఒక పెద్ద రహస్యాన్ని





జకం కలిగిస్తారు. అదీగాక రాణికి ఇతర అవలక్షణా లెన్ని ఉన్నా కొడుకంటే వెర్రి అభిమానం ఉన్నది. అందుచేత క్లాడియస్ ఏం చేయదలిచాడంటే, ఏదో ఒక సాకుపెట్టి హామ్లెట్‌ను తన మనుషులవెంట ఇంగ్లాండుకు పంపించి, అక్కడ పరిపాలించే తన సామంతుడిచేత అతన్ని హత్యచేయింతా మనుకున్నాడు.

పాలోనియస్ వెళ్ళినాక కాస్సేపటికి హామ్లెట్ తన తల్లిని చూడటానికి ఆమె గదికి బయలుదేరాడు. ఈలోపుగా పాలోనియస్ రాజువద్దకు వెళ్ళి, "మహారాజా, యువరాజుగారు రాణీగారి గదికి వెళ్ళబోతున్నారు. నేను ముందుగా అక్కడికి వెళ్ళి, ఆ గదిలో ఉండే తెరలచాటున నక్కి యువరాజు మాటలన్నీ విని, వీలయితే అతని పిచ్చికి కారణమేమిటో తెలుసుకుంటాను!" అని చెప్పి, రాజుగారి అనుమతి పొంది, రాణిగారి గదికి వెళ్ళి, ఆవిడ అనుమతితో తెరలచాటున దాక్కున్నాడు.

బయటపెట్టినందుకు హామ్లెట్ ఆనందంలో ఉండగా అతనిని తల్లిగారు పిలుస్తున్నట్టు పాలోనియస్ వచ్చి చెప్పాడు. "తరవాత వస్తాను!" అని చెప్పి హామ్లెట్ పాలోనియస్‌ను పంపేశాడు.

ఈలోపల రాజు క్లాడియస్ హామ్లెట్ పిచ్చి తనకు ప్రమాదకరమని నిశ్చయించుకున్నాడు. హామ్లెట్‌ను ఏదో ఒక విధంగా చంపేస్తేనేగాని తనకు క్షేమం లేదు. కాని హామ్లెట్ హత్య డెన్మార్క్ దేశంలో జరిగితే చాలా చిక్కులున్నాయి. యువరాజంటే ప్రజలకు అంతు లేని ప్రేమ; అతన్ని ఎవరైనా హత్యచేస్తే ప్రజలు తిరగబడి అరా

కొద్దిసేపటికి హామ్లెట్ తల్లి గదికి వచ్చి, "ఏమమ్మా, ఎందుకు పిలిచావుట?" అని అడిగాడు.

"ఏమీలేదు. నువ్వు మీ నాన్నగారికి మరీ ఆగ్రహం తెప్పిస్తున్నావురా!" అన్నది తల్లి.



తన తండ్రిని హత్యచేసిన దుర్మార్గుణ్ణి ఆవిడ తన నాన్నగారనటం విని హామ్లెట్ రక్తం ఉడికిపోయింది.

"మా నాన్నగారికి ఆగ్రహం తెప్పించినది నువే!" అన్నాడతను.

"నోటికి వచ్చినట్టు మాట్లాడకు," అన్నది తల్లి.

"వెయ్యరాని ప్రశ్నలు వెయ్యకు!" అన్నాడు కొడుకు.

అతని ధోరణికి నిర్ఘాంతపోయి రాణి, "నేనెవరినో గుర్తించే ఇలా మాట్లాడుతున్నావా?" అని అడిగింది.

"నువు రాణివి. నీ మొగుడి తమ్ముడి భార్యవు. నాకు తల్లివి. అలా కాకుంటే ఎంతో బాగుండేది!" అన్నాడు హామ్లెట్.

"నీతో మాట్లాడవలిసినదాన్ని నేను కాదు!" అంటూ రాణీ తన భర్తను పిలుచుకురావటానికి లేవబోయింది. హామ్లెట్ ఆమెను అటకాయించి, "అలా కదలకుండా కూచో! నీకు అద్దంలో నీ మొహం చూపిస్తాను. ఆ తరవాత మరీ కదులు!" అన్నాడు.

రాణి కంగారుపడి, "నన్ను చంపేస్తావుట్రా?....ఎవరట్రా? రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టింది.



ఈ కేకలు విని తెరల వెనక ఉన్న పాలోనియస్‌కూడా పాలోమని, "రక్షించండి! రక్షించండి!" అని కేకలు పెట్టాడు.

"ఇక్కడ చేరావా, ఎలుకా?" అంటూ హామ్లెట్ కత్తి దూసి తెరకుండా పాలోనియస్‌ను పొడిచేశాడు. ఆ పోటుతో పాలోనియస్ తెరవెనక చచ్చిపడ్డాడు.

మొదట హామ్లెట్ తాను చంపినది తన పినతండ్రినే ననుకున్నాడు. కాని తెరవెనక నుంచి శవాన్ని లాగినాక అతనికి నిజం తెలిసి విచారం కలిగింది. కాని జరిగిన దానికి విచారించి లాభం లేదు. అతను తల్లితో తన తండ్రి హత్యను గురించీ, ఆయన

దయ్యం రూపంలో తనకు కనిపించటం గురించీ చెప్పాడు. అతను తల్లితో, "అమ్మా, అటువంటివాడికి భార్యవై ఉండి ఇటువంటి నీచుణ్ణి ఏమని పెళ్ళాడావు? నక్కకూ నాక లోకానికీ ఎంత తేడా ఉన్నదో ఈ పాపిష్టి ముఖానికీ నా తండ్రికీ అంత తేడా ఉన్నదే. ఇకనైనా వీణ్ణి దూరంగా ఉంచు. నాకు నిజంగా ఏ పిచ్చీ లేదు. జరిగినదానికి పశ్చాత్తాపపడు. అలా అయితేనే నీవు నాకు నిజమైన తల్లివి!" అన్నాడు.

కొడుకు మాటలతో రాణికి కను విప్పయింది. ఆమె అతను చెప్పినట్టే చేస్తానని మాట ఇచ్చింది.

ఒళ్లు తెలియని పిచ్చిలో పొలోనియస్‌ను చంపాడన్నది సాకుగా పెట్టి రాజు క్లాడియస్ హామ్లెట్‌ను ఇంగ్లాండుకు ప్రయాణంచేశాడు. రాజు మనుషులు హామ్లెట్‌ను పడవలో ఎక్కించి ఇంగ్లాండుకు బయలుదేరారు. వారివెంట ఉన్న పత్రాలను హామ్లెట్ రహస్యంగా విప్పి చూశాడు. తన పినతండ్రి తనను హత్య చేయించటానికే ఇంగ్లాండు పంపుతున్నాడన్న విషయం వాటిద్వారా అతడు తెలుసుకున్నాడు.

వెంటనే అతను వేరే పత్రాలను తయారు చేసి, వాటిలో రాజుగారి మనుషులను హత్య చేయవలసిందిగా రాసి, తన వద్ద ఉన్న తన





తండ్రి ముద్రికతో సీలువేసి, పత్రాలను యథాస్థానంలో పెట్టేశాడు.

ఇది జరిగిన మర్నాడే సముద్రపుదొంగల పడవ ఒకటి హామ్లెట్ ఉన్న పడవను తరుముకు వచ్చింది. రెండు పడవలూ కలుసుకుని పోరాటం సాగే సమయంలో హామ్లెట్ దొంగల పడవలోకి దూకేశాడు. మిగిలినవాళ్లు తమ పడవతోసహా తప్పించుకుపోయారు.

తమకు ఒంటరిగా చిక్కిన హామ్లెట్‌ను దొంగలు మర్యాదగానే చూశారు. వారు అతన్ని తిరిగి డెన్మార్క్ తీరానికి తెచ్చి దించారు. మర్నాటికి తాను ఇంటికి వచ్చి చేరగలనని హామ్లెట్ తన పినతండ్రికి జాబు రాశాడు.

ఈలోపుగా, హామ్లెట్ ప్రియురాలు ఒఫీలియా పిచ్చిదైపోయింది. తన తండ్రి హత్య కావటమూ, ఆయనను హత్య చేసినవాడు తన ప్రియుడే కావటమూ గ్రహించినమీదట ఆమెకు మతి చెడిపోయింది. ఆమె కొద్ది కాలంపాటు ఏవేవో పాటలు పాడుకుంటూ ఎక్కడబడితే అక్కడ తిరిగి చివరకు ఒక వాగులో పడి చనిపోయింది.

పొలోనియస్‌కు లాయెర్టిస్ అనే ఒక కొడుకున్నాడు. అతను పారిస్‌లో చదువు కుంటున్నాడు. తన తండ్రి చనిపోయాడని



తెలియగానే అతను తుఫానులాగా వచ్చి పడ్డాడు. కొందరు జనం అప్పటికప్పుడే అతని పక్షమై, "లాయెర్టిస్ మాకు రాజు కావాలి," అని నినాదాలు సాగించారు.

ఆ మూకను వెంటవేసుకుని అతను రాజుగారి ఇంటిపైకి వచ్చాడు. రాజభటులు ద్వారాలను కాయలేకపోయారు. అతను తలుపులు పగలగొట్టుకుని లోపలికి వచ్చి క్లాడియస్‌తో, "తుచ్ఛుడా, నా తండ్రి ఎక్కడ?" అన్నాడు.

రాజు చాలా యుక్తిగా, చాకచక్యంతో అతని కోపాన్ని సహించి, "నాయనా, నీ కోపాన్ని ఎవరిపైన చూపాలో వారిపైనే చూపు. నీ తండ్రి చావు నిన్ను బాధించినట్టే నన్నూ బాధించింది," అన్నాడు.

ఆ సమయంలోనే లాయెర్టిస్ తన చెల్లెలిని ఉన్మాద స్థితిలో చూసి చాలా బాధపడ్డాడు కూడా. అతను వచ్చినాకనే ఆమె చని పోయింది.

రాజు లాయెర్టిస్‌తో ఏకాంతంగా మాట్లాడి అతని చేత హామ్లెట్‌ను చంపించటానికి పథకం వేశాడు.

"హామ్లెట్ నీ తండ్రిని చంపాడు. నీవంటి పరాక్రమవంతుడు అందుకు పగ తీర్చుకోకుండా ఉండలేడు. హామ్లెట్ వస్తున్నాడు. కత్తియుద్ధంలో నీ ప్రావీణ్యాన్ని ఎవరైనా ప్రశంసిస్తే చాలు, అతను రెచ్చిపోయి తన పరాక్రమం ప్రదర్శించటానికి సిద్ధపడతాడు. అప్పుడు నువు అతనిపై పగ తీర్చుకోవచ్చు," అని రాజు మంత్రి కొడుకుకు బోధించాడు.

"నావద్ద ఒక ఘోరమైన విషం ఉన్నది. అది నా కత్తి మొనకు కొంచెం పూస్తే చాలు, దానితో ఏపాటి గాయం అయినా, చావు తప్పదు!" అన్నాడు లాయెర్టిస్.

"మనం ఈ ఏర్పాట్లన్నీ ఎవరికీ ఎట్టి అనుమానమూ తగలకుండా చేయాలి. దీన్ని ఒక వినోదపు పోటీగా ఏర్పాటుచేస్తాం. రెండు పక్షాలా పందాలు కాద్దాం. ఈ పందెపు



పోటీలో ఏ కారణంచేతనైనా యువరాజు చావకుండా బయటపడే పక్షంలో అతన్ని కడతేర్చటానికి మరొక మార్గంకూడా ఆలోచించి ఉంచాలి. అందుకుగాను నేను, పానీయంలో విషం కలిపి సిద్ధంగా ఉంచుతాను," అన్నాడు రాజు.

హామ్లెట్ వచ్చేసరికి శ్మశానంలో ఒఫీలియాను పూడ్చటానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. శ్మశానంవద్దకు హామ్లెట్, హొరేషియో చేరిన కొద్దిసేపటికి శవంతోసహా రాజూ, రాణీ, లాయెర్టిస్, పురోహితులూ, పరివారమూ వచ్చారు. ఆ శవం ఎవరిదో మొదట హామ్లెట్‌కు తెలియదు. అతను చాటున ఉండి సంభాషణ వింటూ ఒఫీలియా చనిపోయిందని తెలుసుకుని ఆశ్చర్యపడ్డాడు. శవాన్ని గోతిలోకి దించారు. లాయెర్టిస్ తన చెల్లెలిపై ప్రేమకొద్దీ తానుకూడా గోతిలోకి దూకి, "నన్నుకూడా పూడ్చిపెట్టండి. మామీద కొండంత ఎత్తు మట్టి పేర్చండి!" అని కేకలు పెట్టాడు.

ఇది చూసి హామ్లెట్ ముందుకు వచ్చి తానుకూడా గోతిలోకి దూకాడు. ఇద్దరూ కొట్లాడుకోసాగారు. మిగిలినవాళ్లు వచ్చి వారిద్దరినీ విడిపించి, గోతిలోనుంచి పైకి రప్పించారు.

"నలభైవేలమంది అన్నలయినా నేను ఒఫీలియాను ప్రేమించినంతగా ప్రేమించలేరు. కావలిస్తే ఆ సంగతి నిరూపించటానికి నేను యుద్ధం చేస్తాను!" అన్నాడు హామ్లెట్ ఆవేశంతో.

తరవాత రాజభవనంలో రాజూ, రాణీ మొదలైన ప్రేక్షకుల సమక్షంలో హామ్లెట్‌కూ, లాయెర్టిస్‌కూ కత్తియుద్ధం పోటీ ఏర్పాటయింది. అది వినోదపు పోటీయేనని హామ్లెట్ నమ్మాడు. కాని లాయెర్టిస్ కత్తికి విషం పూసిఉన్నది. మరొక లోటాలో విషం కలిపిన పానీయం హామ్లెట్ కోసం సిద్ధంగా ఉన్నది.



కత్తియుద్ధంలో పరసగా రెండుసార్లు యువరాజే మంత్రికొడుకును కొద్దిగా గాయపరిచాడు. ఈలోపుగా రాణి హామ్లెట్‌కోసం సిద్ధంగా ఉంచిన విషపు పానీయాన్ని అందుకుని, రాజు తాగవద్దని అంటున్నప్పటికీ వినిపించుకోకుండా తాగేసింది.

ఇంతలో లాయెర్టిస్, తన విషపు కత్తితో హామ్లెట్‌ను గాయపరిచాడు. మరుక్షణం ఇద్దరూ కలియబడటంలో ఒకరి కత్తి ఒకరికి వచ్చింది. హామ్లెట్ తన చేతికి వచ్చిన విషపు కత్తితో లాయెర్టిస్‌ను గాయపరిచాడు. ఈలోపుగా రాణీ పడిపోయింది.

లాయెర్టిస్, "నా ద్రోహం నన్నే ముంచింది!" అన్నాడు.

"అమ్మ ఎలా ఉంది?" అన్నాడు హామ్లెట్.

"నాయనా, హామ్లెట్! పానీయంలో విషం కలిపారు!" అంటూ రాణీ ప్రాణాలు వదిలింది.

"తలుపులన్నీ మూసి హంతకుణ్ణి పట్టండి!" అని హామ్లెట్ కేకపెట్టాడు.

"హామ్లెట్, నువ్వూ చచ్చినవాడికింద జమే. విషపు కత్తి నీ చేతిలోనే ఉంది. ఇదంతా రాజు చేసిన ద్రోహమే!" అన్నాడు లాయెర్టిస్.

"హంతకుడా! పాపీ! చావు!" అంటూ హామ్లెట్ తన చేతిలోని విషపు కత్తితో రాజును పొడిచాడు.

"హామ్లెట్, నన్ను క్షమించు. ఆ దుర్మార్గుడికి అంతే కావాలి. నా చావుకూ, నా తండ్రి చావుకూ నువ్వు బాధ్యుడివి కావు. నీ చావుకు నేనూ బాధ్యుణ్ణి కాను!" అంటూ లాయెర్టిస్ ప్రాణం వదిలాడు.

కత్తివేటు తిన్న రాజూ, హామ్లెట్‌కూడా ప్రాణాలు వదిలారు.

ఈ విధంగా క్లాడియస్ దురాశతో ప్రారంభమైన హత్యాకాండ సర్వనాశనానికి దారితీసింది.



# ప్రాణభీతి

ఒక సుల్తాను పరివారాన్ని వెంటతీసుకుని నదిలో పడవ షికారుకు వెళ్లాడు. పడవ సరిగా నదిమధ్య వుండగా పెద్ద గాలి వచ్చి, పడవ అటూ యిటూ ఊగసాగింది. సుల్తానుగారి సేవకుల్లో ఒకడు ప్రాణభీతితో వణికిపోతూ, పడవకళాసుల్తో, "అయ్యా, పడవ ఒడ్డుకు పట్టించండి. నాకు ఈత రాదు. నదిలో మునిగి పోతాను," అంటూ కేకలుపెట్టసాగాడు.

కళాసులూ, సుల్తాను పరివారంలోనివాళ్లూ అతడికి భయపడవద్దని చెప్పి చూశారు. కాని, సేవకుడు మరింతగా అరుస్తూ ఏడవసాగాడు. ఇదంతా గమనిస్తున్న వజీరు, సుల్తానుతో, "మహాప్రభూ! తమరు అనుమతిస్తే, వీడి ప్రాణభీతికి నేను చికిత్సచేస్తాను!" అన్నాడు. సుల్తాను సరేనన్నట్టు తల వూపాడు.

వజీరు ఆజ్ఞ కాగానే ఇద్దరు కళాసులు, కేకలుపెడుతున్న సేవకుణ్ణి పట్టుకుని పడవమీదినుంచి నదిలోకి విసిరివేశారు. ఈత రాని ఆ సేవకుడు, నదిలో పడి మునిగి తేలినప్పుడల్లా, "నేను మునిగిపోతున్నాను, పడవలోకి లాగండి!" అంటూ అరవసాగాడు. వజీరు వాణ్ణి నదిలోనుంచి పడవలోకి చేర్పించాడు. సేవకుడు బతుకుజీవుడా అనుకుని పడవలో ఒకమూల ఒదిగి కూర్చున్నాడు.

అప్పుడు సుల్తాను వజీరుతో, "ఏమిటీ, వీడికి హఠాత్తుగా ప్రాణభీతి పోయిందే!" అన్నాడు.

వజీరు నవ్వుతూ, "మహాప్రభూ! వీడికి పడవమీద వుండగా, దానికన్న ఒడ్డుచేరటం క్షేమంగా కనబడింది. నీటిలో పడినతరవాత, దానికన్న పడవలో వుండటం క్షేమం అని తెలుసుకున్నాడు," అన్నాడు.





ఆర్టిస్టు, వేరఉమసోవ "కీచు" గుర్రానికి అలంకరణ చేస్తున్నది.

# "కీచు" బొమ్మలు

బొమ్మ లన్నిటిలోకీ పిల్లల కిష్టమైనవి "కీచు"బొమ్మలు. రబ్బరుతోగాని, ప్లాస్టిక్‌తోగాని, గుడ్డతోగాని చేసిన ఈ బొమ్మలు నొక్కితే కీచుమంటాయి. పిల్లలు వాటిని నొక్కి కీచుమనిపించి పరమానందం చెందుతారు. కొన్ని బొమ్మలు గట్టిగా ఉండికూడా అటూ ఇటూ కదిలిస్తే కీచుమంటాయి. ఒక రకం బొమ్మ పడుకోబెడితే కళ్లు మూస్తుంది, నిలబెడితే "క్యారు"మంటుంది.

కాని మాస్కోలో అద్భుతమైన కీచుబొమ్మలు చేసే ఫాక్టరీ ఒకటి ఉన్నది. ఇక్కడ తయారయే బొమ్మలలో విశేషమేమిటంటే పిల్లులు "మ్యావు" మంటాయి, కుక్కలు "బొంయి" మంటాయి, గుర్రాలు సకిలిస్తాయి, ఎలుగుబంట్లు అరుస్తాయి, కోళ్లు "కొక్కొరోకో" అంటాయి. పిల్లిబొమ్మా, ఎలుకబొమ్మా,

ఆవుబొమ్మా ఒకేలాగు కీచుమంటే ఏం సరదాగా ఉంటుందీ? ఈ మాస్కో కీచుబొమ్మలు నిజంగా సరదాగా ఉండిఉండాలి.

ఇది "ధ్వనియంత్రాల" ఫాక్టరీ. ఇక్కడ అన్నిరకాల ధ్వనులూ శాస్త్రీయంగా ఉత్పత్తి చేసి, వాటికి తగిన బొమ్మలలో అమర్చుతారు. ఈ ధ్వనులు ఉత్పత్తి చెయ్యటానికి లోహపు తూతూలూ, తిత్తులూ, స్ప్రింగులూ మొదలైన రకరకాల పరికరాలు అమర్చుతారు. నొక్కే బొమ్మలలోకి గాలి వెళ్లి "తూతూ"లో నుంచి బయటికి వచ్చేటప్పుడు కీచుమని చప్పుడవుతుంది. కొన్ని బొమ్మలు తల కిందయినప్పుడు తిత్తులు వాటి బరువుకు అవే మూసుకుని చప్పుడవుతుంది.

ఈ ఫాక్టరీకి వెలపల నిలబడి లోపలినుంచి వినవచ్చే చప్పుళ్లు వింటూంటే జంతు ప్రదర్శనశాల ఒకటి లోపల ఉన్నట్టు తోస్తుందట.

గ్లెబ్ ష్పెర్ప (చీఫ్ ఇంజనీర్) గలీన తిత్కొన (ఇన్‌స్పెక్టరు) కీచుబొమ్మలు పరీక్షిస్తున్నారు.





హారతి కర్పూరం అంటుకుని దుకాణం తగలబడుతున్నది, దారేపొయ్యే జనం తమ ఇష్టదేవతలకు దణ్ణాలు పెట్టుకున్నారు.




లావుమనిషి: కళ్లు కనపడటం లేదా?

మీదపడిన మనిషి: కళ్లుండబట్టే మీమీద పడ్డాను. అతనిమీద పడితే మా ఇద్దరి గతీ ఏమైఉండును.



తండ్రి: నువ్వు తెచ్చిన నీటిలో ఎంత దుమ్ముందో చూశావా.

పిల్ల: లేదు, నాన్నా. అది నీ కంటి అద్దం పైన ఉన్న దుమ్ము.




ఒక చెవిటివాడు: మార్కెటు దాకానా?

రెండో చెవిటివాడు: లేదు, మార్కెటుకు.

మొదటి చెవిటివాడు: ఓహో! మీ సంచీ చూసి మార్కెటుకు అనుకున్నా.




[ 7 ]

వచ్చాడు రాజకుటుంబంవారందరూ బుద్ధుణ్ణి కళ్లారా చూచిన ఆనందంలో వుండి ఆయనకోసం ఆహారం సిద్ధంచెయ్యటం మాటే మరిచారు. ఆ ఉదయం బుద్ధుడు పళ్లు తోముకుని, ముఖం కడుక్కుని ఒక ఏకాంతస్థలంలో ధ్యాననిమగ్నుడయాడు. భోజనంవేళ కాగానే ఆయన లేచి, తన భిక్షాపాత్ర తీసుకుని ప్రతి యింటా భిక్ష తీసుకోవటానికి బయలుదేరాడు.

నగరంలో జనం ఆయనను చూసి ఎగబడ్డారే గాని ఆయన భిక్షానికి బయలుదేరాడనీ, ఏ ఇంటిముందు ఆగితే ఆ యింటివారు భిక్ష పెట్టాలనీ వారికి తెలియదు. వారికి అలాటి ఆచారం వుంటుందనికూడా తెలియదు. అందుచేత ఏ ఇంటా ఆయనకు భిక్ష లభించలేదు.

బుద్ధుడు ప్రతి ఇంటిముందూ నిలుస్తూ రాజభవనం చేరాడు. అంతఃపుర స్త్రీలు ఆయనను చూడటానికి మేడలు దిగివచ్చి, కిటికీలవద్ద నిలబడ్డారు. యశోధర అదివరకే వినివున్నది: ఈ నగరంలో రథమెక్కి తిరిగిన సిద్ధార్థుడు కేశఖండన చేయించుకుని, కాషాయవస్త్రాలు ధరించి, మట్టి పాత్రలో బిచ్చమెత్తుకుంటున్నాడట! ఈ వేషంలో ఆయన ఎలా వున్నాడో చూడాలని ఆమెకూడా ఒక ద్వారంవద్ద నిలబడింది.

బుద్ధుడు రాగానే ఆమె ఆయనకు మనసులో నమస్కారంపెట్టుకుని, "రాహులుడు




పుట్టిననాడు సమస్తాన్నీ, రాజ్యాన్నీ త్యజించి వెళ్ళిపోయి, అంతకంటె గొప్ప రాజ్యాన్ని సంపాదించుకున్నావా, సిద్ధార్థా?" అనుకున్నది. తరవాత ఆమె తన మామగారైన శుద్ధోదనుడివద్దకు వెళ్లి, "మీ కొడుకు ఇంటింటా బిచ్చమెత్తుతూ యిక్కడికి వస్తున్నాడు!" అని చెప్పింది.

శుద్ధోదనుడు ఈ మాట వింటూనే ఆవేశపరవశుడై బుద్ధుడివద్దకు పరిగెత్తి వెళ్లి, "నాయనా, నీవెంట జంబూద్వీపంలో ఉండే రాజులు సపరివారంగా వచ్చినా అందరికీ భోజనాలు పెట్టగలనే, నీకూ నీ ఇరవై వేలమంది శిష్యులకూ భోజనం



పెట్టలేనా? ఎందుకుగాను బిచ్చమెత్తవలిసి వచ్చింది?" అని అడిగాడు.

"ఇది నా జాతిధర్మం!" అన్నాడు బుద్ధుడు.

శుద్ధోదనుడు విస్తుపోయి, "జాతి ధర్మమా? నీవు మహా సమ్మతుడి జాతిలో జన్మించావు, నాయనా! ఆ జాతికి చెందినవారెవరూ ఎన్నడూ, ఈ విధంగా బిచ్చమెత్తలేదే!" అన్నాడు.

"నేను సమ్మతుడి జాతిని గురించి మాట్లాడలేదు, బుద్ధుల జాతిగురించి చెప్పాను. కొడుకుకు పెన్నిధి దొరికితే అందులో గల ముఖ్య రత్నాలను తండ్రికి సమర్పించటం కుమారుడి విధి. అందుచేత నాకు దొరికిన అమూల్య రత్నాలను నీకిస్తాను తీసుకో; తాత్సారం చేయవద్దు, ధర్మం తెలుసుకుని శుభం పొందు. ధర్మం ప్రకారం స్వీకరించదగినదెల్లా స్వీకరించి, విసర్జించవలసినదెల్లా విసర్జించు. ధర్మాన్ని పాలించినవాడు శుభాలు పొందుతాడు," అని బుద్ధుడు నడివీథిలో తండ్రికి ధర్మోపదేశం చేశాడు.

బుద్ధుడు చేసిన ప్రబోధం విన్నాక శుద్ధోదనుడు తన కొడుకు చేతిలోని భిక్షాపాత్ర తాను తీసుకుని, బుద్ధుడికీ, ఆయన వెంట







ఉన్న శిష్యులకూ భోజనాలు పెట్టించాడు. భోజనాల అనంతరం రాజభవనానికి చెందిన నలభైవేల మంది స్త్రీలు బుద్ధుడికి వందనాలు చేయువచ్చారు.

వారిలో యశోధర లేకపోవటం గమనించి శుద్ధోదనుడు ఆమెనుకూడా రమ్మని కబురు చేశాడు. "ఆయనకు నాపై ఆదరం ఉన్న పక్షంలో ఆయనే నావద్దకు వస్తాడు; అప్పుడు నేనాయనను పూజిస్తాను." అని యశోధర సమాధానం పంపింది.

ఈమాట విని బుద్ధుడు యశోధరను చూడడానికి ఆమె ఉండే గదికి బయలు దేరాడు. దారిలో ఆయన తన ప్రధాన శిష్యులైన ముగలానుడితోనూ, సేరియుతుడి తోనూ, "ఈమె అనేక జన్మలలో నాకు ఎంతో సాయపడింది. ఇప్పుడామె జన్మ రాహిత్యం పొందబోతున్నది. తుచ్ఛమైన కామాన్ని నేను జయించాను గాని ఆమె ఇంకా జయించలేదు. నన్ను చూసి చాలా కాలమైనందున ఆమె మనసు చాలా వేదన పడుతున్నది. ఈ వేదనను బయటికి రానివ్వక అణచినట్టయితే ఆమె గుండె విచ్చి పోతుంది. ఆమె నా పాదాలు అంటవచ్చు; కాని అలా చేయనిచ్చినందువల్ల ఆమె సన్యాసిని అయి మనలో చేరిపోతుంది. కనుక మీరామెను నివారించకండి!" అని చెప్పాడు.

బుద్ధుడు తనను చూడవస్తున్నాడని తెలియగానే యశోధర నారబట్టలు కట్టుకుని ఎదురు వెళ్ళింది. ఆమె బుద్ధుణ్ణి చూస్తూనే, తప్పని తెలిసికూడా, ఆయన పాదాలు పట్టుకుని భోరుమని ఏడిచింది.

మరుక్షణం తన మామగారు అక్కడే నిలబడి ఉండటం తెలుసుకుని సిగ్గుపడుతూ లేచి నిలబడింది.

"ఈమె నీపైగల ప్రేమకొద్దీ ఇలా ప్రవర్తించింది. ఆమెను క్షమించు," అన్నాడు శుద్ధోదనుడు బుద్ధుడితో.





"ఈమె అనేక జన్మలలో నాకు సహ ధర్మచారిణిగా ఉండి బుద్ధుడికి భార్యఅయే అర్హత సంపాదించుకున్నది," అంటూ బుద్ధుడు ఆమె పూర్వజన్మల వృత్తాంతం గురించి చెప్పాడు.

అది విన్నమీదట యశోధరాదేవి దుఃఖం మాని ఊరట చెందింది.

శుద్ధోదనమహారాజు రెండవ భార్య అయిన మహాప్రజాపతికి నందుడని ఒక కుమారుడున్నాడు. బుద్ధుడు యశోధరను చూసిన మర్నాడే నందుడి వివాహ మహోత్సవం ఏర్పాటయింది. దానితోబాటు నూతన గృహప్రవేశంకూడా జరగనున్నది.

అందుచేత ఆ రోజు ఉదయం బుద్ధుడు న్యగ్రోధవనం నుంచి ఈ ఉత్సవ మంటపానికి వెళ్లాడు. ఆయనవెంట అర్హతులందరూ ఉన్నారు. నందుణ్ణి మోక్షమార్గంలో పెట్టటమే బుద్ధుడి ఉద్దేశం.

ఆయన తనకు వేసిన ప్రత్యేకాసనంపై కూచుని నందుడితో, "నిజమైన ఉత్సవ మంటే ఏమిటో తెలుసునా? తుచ్ఛమైన కోరికలను నిర్మూలించటం, బ్రహ్మచర్యం అవలంబించటం, నాలుగు సత్యాలను తెలుసుకోవటం, నిర్వాణం అంటే ఏమిటో అర్థం చేసుకోవటం," అంటూ అతనికి ధర్మోపదేశం చేశాడు.





త్వరలోనే నందుడు బుద్ధుడి మార్గం అవలంబించటానికి సిద్ధపడ్డాడు. బుద్ధుడు అతని చేతిలో భిక్షాపాత్ర ఉంచి తన విహారానికి బయలుదేరాడు. పెళ్లికొడుకువేషంలో ఉన్న నందుడు భిక్షాపాత్ర చేతబట్టి బుద్ధుడి వెనకనే విహారానికి వెళ్లాడు.

పెళ్లికూతురు పేరు జనపదకల్యాణి. ఆమె కిటికీలోనుంచి, తన కాబోయే భర్త బుద్ధుడి వెంట వెళ్లిపోతూండటం చూసి, ఎక్కడికి పోతున్నావని ప్రశ్నించింది. కాని నందుడు జవాబు చెప్పలేదు.

ఇద్దరూ విహారం చేరుకున్నాక బుద్ధుడు నందుడితో, "రాజ్యకాంక్షలు తొలగించుకుని నాలాగే సన్యాసం స్వీకరించు!" అన్నాడు. నందుడి మనస్సు చంచలంగా ఉన్నది. అతను పెళ్లికూతురిని గురించే ఆలోచిస్తూ పైకిమాత్రం ఏమీ అనలేదు. అందుచేత బుద్ధుడు తన ప్రధాన శిష్యులతో, "ఇతనికి సన్యాసం ఇవ్వండి," అన్నాడు.

అది మొదలు నందుడు మనోవ్యాధితో చిక్కిపోసాగాడు. ఇలా చిక్కిపోవటానికి కారణమేమని మిగిలినవారు అతన్ని అడిగారు. "నీవు బుద్ధుడికి సయాన తమ్ముడివి, రాజవంశంవాడివి, ఏలోటూ ఎరగనివాడివి; నీకు విచారం ఉండవలిసిన పని లేదే!" అని వారన్నారు.





"నేను బుద్ధుడి చేతినుంచి భిక్షాపాత్ర తీసుకుని బయలుదేరినప్పుడు పెళ్ళికుమార్తె అయిన జనపదకల్యాణి నన్ను వెంటనే తిరిగి రమ్మన్నది. ఆమె కారణంగానే నాకీ చింత పట్టుకున్నది!" అన్నాడు నందుడు ఎంతో విచారపడుతూ.

ఈ సంగతి బుద్ధుడికి తెలిసింది. ఆయన నందుడితో, "నీకు కాబోయే భార్య చాలా చక్కనిదా?" అన్నాడు.

"చాలా చక్కనిది!" అంటూ నందుడామెను దీర్ఘంగా వర్ణించాడు.

"అంతకంటె అందగత్తెలు ప్రపంచంలో లేరా?" అన్నాడు బుద్ధుడు.



"జంబూద్వీపంలో ఎక్కడా లేరు!" అన్నాడు నందుడు.

బుద్ధుడు తన శక్తిచేత నందుడికి దేవతా స్త్రీలను చూపి, "జనపదకల్యాణి వీరికన్న అందంగా ఉంటుందా?" అని అడిగాడు.

"వీరితో పోలిస్తే చాలా వికారంగా ఉంటుంది!" అన్నాడు నందుడు.

"అయితే వీరిలో ఎవరినైనా భార్యగా స్వీకరిస్తావా?" అని బుద్ధుడు అడిగాడు.

"అది ఎలా సాధ్యం?" అన్నాడు నందుడు.

"నేను చెప్పే బోధలు ఆలకించి, వాటి ప్రకారం నడుచుకుంటే అది సాధ్యమవుతుంది," అన్నాడు బుద్ధుడు.

ఈ మాటలతో నందుడి విచారం విరిగిపోయింది. అతను బుద్ధుడి బోధలు విని త్వరలోనే అర్హతుల శ్రేణిలో చేరిపోయాడు.

బుద్ధుడు కపిలవస్తునగరం చేరి సరిగా వారమయింది. యశోధర తన ఏడేళ్ల కొడుకును రాహులుణ్ణి చక్కగా అలంకరించి, "నాయనా, ఎంతో తేజస్సుతో వెలిగిపోతూండే ఈ సన్యాసి నీ తండ్రి. ఆయన దగ్గిర గొప్ప నిధులున్నాయి. నీవు ఆయనకు వారసుడవు గనక వెళ్లి వాటిని పుచ్చుకో!" అన్నది.



"నాకు తండ్రి ఎవరమ్మా?" అని రాహులుడు అడిగాడు.

యశోధర కిటికీలోనుంచి రాహులుడికి బుద్ధుణ్ణి చూపించింది. ఆ సమయంలో బుద్ధుడు రాజభవనానికి వచ్చి భోజనం చేస్తున్నాడు. ఆయనను రాహులుడికి చూపుతూ, "ఆయనే నీ తండ్రి!" అని చెప్పింది యశోధర.

రాహులుడు బుద్ధుడు భోజనంచేసే చోటికి వెళ్ళి మొదట, "నాన్నా!" అని పిలిచాడు. తరవాత అతను నిర్భయంగా, "ఓ సన్యాసీ, నీ అండ నాకు అమూల్యం!" అన్నాడు.

బుద్ధుడు భోజనం ముగించి, రాహులుణ్ణి ఆశీర్వదించాడు. "నీదగ్గిర ఏవో నిధులున్నాయట, అమ్మ చెప్పింది. వాటిని నాకిస్తావా?" అని రాహులుడు అడిగాడు. బుద్ధుడు వెళ్ళిపోయేటప్పుడు రాహులుడు ఆయనవెంట బయలుదేరాడు. ఆతన్ని బుద్ధుడుగాని ఇతరులుగాని వారించలేదు. తన కుమారుడు బుద్ధుడివెంట పోతూ ఉండటం కిటికీలోనుంచి గమనించిన యశోధర మటుకు, రాహులుడు కూడా నందుడిలాగే సన్యాసం తీసుకుంటాడేమోనని భయపడి, దుఃఖించింది. రాహులుణ్ణి వెంట పెట్టుకుని విహారం చేరాక బుద్ధుడు సేరి





యుతుడితో, "రాహులుడు నా ఆస్తికోసం అడుగుతున్నాడు. దుఃఖానికి దారితీసే ఆస్తి ఏదీ వాడికివ్వవలచలేదు, శాశ్వత సుఖాన్నిచ్చే సన్యాసం వాడికిస్తాను!" అన్నాడు.

తరవాత సేరియుతుడు రాహులుడికి సన్యాసం ఇచ్చాడు. ఈ వార్త తెలిసి శుద్ధోదనుడు చాలా విచారపడ్డాడు. అయన బుద్ధుడివద్దకు వెళ్ళి, "నా కొడుకులిద్దరూ— సిద్ధార్థుడూ, నందుడూ—సన్యసించారు. ఇప్పుడు నా మనవడు రాహులుడుకూడా సన్యసించాడు! వాణ్ణి ఇంతకాలమూ నా కొడుకులాగా చూసుకుంటున్నాను. వాణ్ణి కూడా నాకు దూరం చేయటం భావ్యం కాదు!" అని ఆక్షేపణ తెలిపాడు.

"ఇక మీదట తల్లిదండ్రుల అనుమతి లేనిదే ఎవరికి సన్యాసం ఇవ్వము!" అని బుద్ధుడు శుద్ధోదనుడికి మాట ఇచ్చాడు.

బుద్ధత్వం సంపాదించిన తొమ్మిదవ నెలలో గౌతముడు తొలిసారిగా సింహళానికి వెళ్ళాడు. ఆయన మహావేలి నదీతీరాన మహానాగ అనే పేరుగల ఉద్యానవనం వద్ద దిగాడు. ఆ కాలంలో ఆ ప్రాంతాన యక్షులనే జాతివారి మధ్య అంతఃకలహాలూ, యుద్ధాలూ తీవ్రంగా సాగుతూండేవి. ఆ యక్షులు బుద్ధుడికి తమ ఉద్యానవనంలో లేడిచర్మం మేర చోటుమాత్రమే ఇవ్వటానికి ఒప్పుకున్నారు. కాని బుద్ధుడు అక్కడ చేరినవారిని తన ప్రబోధాలద్వారా మంచి మార్గానికి తిప్పాడు. తరవాత ఆయన సింహళద్వీపాన్ని మూడుసార్లు చుట్టి తన మతాన్ని ప్రచారంచేసి వేలువనానికి తిరిగి వచ్చేశాడు.

(అటుతరవాత బుద్ధుడు సింహళానికి మరిరెండుసార్లు వెళ్ళాడు. ఆయన శిష్యులు ఆయన జ్ఞాపకార్థం అక్కడ అనేక స్థూపాలు నిర్మించి, ఆయన చెప్పిన నియమాలను ఆచరించుతూ బౌద్ధమతాన్ని సజీవంగా ఉంచారు.) (ఇంకా వుంది)





# పరమ మూఢులు

సంతవానిపల్లెలో శరభయ్యా అనే మోతుబరు ఉండేవాడు. ఊళ్లో సగం పొలాలు ఆయనవే. పొలాలతోబాటు అయనకు పశువులమందలూ, మేకలమందలూ, కోళ్లూ, బాతులూ ఉండేవి. కాని ఇదంతా చూసి శరభయ్యా కొంచెమైనా సంతోషించలేదు, ఎందుకంటే ఆయన కడుపున పుట్టిన ఏడుగురు కొడుకులూ పరమ మూఢులు. వారికి తెలివితేటలు గాని, చదువుసంధ్యలు గాని, లోకజ్ఞానంగాని ఆవగింజంతయినా అబ్బలేదు.

కొడుకులు చిన్నవాళ్లుగా ఉంటున్నప్పుడు, "కాస్త పెద్దయితే దారిన పడక పోతారా?" అని శరభయ్యా సరిపెట్టుకున్నాడు. వీళ్లు మీద పడుతున్నా వారిలో మార్పు లేకపోవటం చూసి, "నా చాటున బతుకుతూ ఉన్నంతకాలమూ వీళ్లకి బుద్ధి రాదు. వేరే ఉంచితేగాని వాళ్లకు బాధ్యతలు తెలియవు," అనుకుని ఆయన వాళ్లు ఏడుగురికీ ఏడు ఇళ్లు కట్టించి, "ఇకనుంచీ మీ ఇళ్లలో మీరుండి, మీ జీవితాలు మీరే దిద్దుకోండి!" అన్నాడు. వాళ్ల అవసరాలకుగాను ఒక్కొక్కడికీ మూడేసి మేలుజాతి పాడిఆవులుకూడా ఇచ్చాడు.

ఆవుల పాడి అనుభవిస్తూ పొలాలమీద వచ్చేది పెట్టుకుని తింటూ ఏడుగురు మూఢులూ తమతమ ఇళ్లలో హాయిగా జీవించసాగారు.

కొంతకాలం గడిచాక పెద్ద సంత వచ్చింది. ఏడుగురు అన్నదమ్ములూ తమ మూడేసి ఆవులనూ వెంటబెట్టుకుని ఉత్సాహంగా సంతకు బయలుదేరారు. సంతలో అమ్మేందుకు ఏదైనా సరుకు తీసుకుపోవాలని వాళ్ల సరదా.

ఆ గ్రామంలోనే దానయ్యా అని మరొక రైతు ఉండేవాడు. అతను చాలాకాలంగా

బి. పరంధామయ్య




శరభయ్య పొలాలమీదా, పశువులమీదా కన్నువేసి ఉంచాడు. వెర్రివాళ్లయిన శరభయ్య కొడుకులు తమ ఆవులను తోలుకు పోతూ ఉండటం చూసి దానయ్యకు కన్ను కుట్టింది. ఐరవైయొక్క ఆవు! భేషైన ఆవులు! ఆ చుట్టుపక్కల ఏగ్రామంలోనూ అంత మంచి మంద కనపడదు.

"అబ్బాయిలూ, తూర్పు తెల్లారకముందే ఆవులతో ఎక్కడికో బయలుదేరారే!" అని దానయ్య ఆ అన్నదమ్ములను పలకరించాడు.

సంతలో ఆవులను అమ్మబోతున్నామని వాళ్లు చెప్పారు.

దానయ్య ముక్కుమీద వేలేసుకుని, "అన్నన్నా! ఇంత గొప్ప పుటక పుట్టి మీరు కూడా ఇంత నీచమైన పని చేస్తారా? దిష్టి తగిలిన ఆవులను ఇంకొకరికి అమ్మవచ్చా? మీ అమ్మగారే గనక బతికుంటే మిమ్మల్ని ఇటువంటి పాడుపని చెయ్యనిచ్చేదేనా?" అన్నాడు దానయ్య.

"దిష్టా? మా ఆవులకు దిష్టి ఎవరు పెట్టారూ?" అని అన్నదమ్ములు అడిగారు.

"మన ఊళ్లో ఉండే మారిగాడు మీ ఆవులకు దిష్టి పెట్టి, చేతబడి కూడా చేశాడుగా! మీ నాయన వాణ్ణి కొట్టబోతే వాడు ఊళ్లోనుంచి పారిపోయాడు కూడానూ?" అన్నాడు దానయ్య.

ఈ మాటలు విని ఆ మూఢులు గొంతు లెత్తి, "ఓరి మారిగాడా! ఎంత పని చేశావురా!" అని ఏడుపులు మొదలు పెట్టారు. ఆ గోలకు ఆవులు బెదిరి తలలు విసురుతూ గెంతనారంభించాయి.

"నా మాటలు నమ్మకపోతే మీరే చూడండి. వాడు చేతబడి చెయ్యబట్టే మీ ఆవులు అట్లా గెంతుతున్నాయి!" అన్నాడు దానయ్య.

"అయితే ఏం చెయ్యమంటావు, దానయ్యా?" అన్నారు మూఢులు.

"చేసే దేముంది? తోళ్ల ఖరీదుకు ఎవరికో ఒకరికి తెగనమ్మండి. దిప్పి తోళ్లకు తగలదుగా! ఆవుకు ఒక రూపాయి రావచ్చు. ఆ రూపాయికోసం మీరు సంతదాకా పోవలిసిన పనికూడా లేదు. మా ఇంటికి రండి, ఆవుల్ని ఒప్పచెప్పి డబ్బు పుచ్చుకుపోండి," అన్నాడు దానయ్య.

ఆ వెర్రివాళ్లు ఆవులను దానయ్యకు ఇచ్చేసి తలా మూడు రూపాయలూ తీసుకుని సంబరం చూడటానికి సంతకు వెళ్లారు. ఈ పిచ్చివాళ్లు సంతలో అడుగు పెట్టగానే నలుగురూ చుట్టూ మూగి వాళ్లచేత ఆ డబ్బు కాస్తా ఖర్చు పెట్టించేశారు. ఆ రోజు వాళ్లు చేతిలో దమ్మిడీకూడా మిగలకుండా ఇళ్లకు తిరిగివచ్చారు.

ఈ సంగతి విన్నాక శరభయ్య తన కొడుకులు బాగుపడరని నిశ్చయించుకున్నాడు. కొంతకాలాని కాయన జబ్బు చేసి చనిపోయాడు. ఆ తరవాత కొడుకులదే రాజ్యం! వాళ్లు తండ్రి ఆస్తిని చిత్తం వచ్చినట్టు తగలెయ్యసాగారు. ఆ గ్రామంలో వాళ్లని మోసం చెయ్యనివాడు లేడు.

ఒకనాడు పెద్దవాడు దానయ్య ఇంటికి వెళ్లి వాళ్ల వసారాలో ఒక తెల్లటి సన్నికల్లు రాయి చూసి, "అదేమిటి, దానయ్యా! అది పెద్దరకం కోడిగుడ్డులాగా ఉందే!" అన్నాడు.



"కోడిగుడ్డు ఎక్కడన్నా అంత పెద్దదిగా ఉంటుందా? అది గుర్రంగుడ్డు!" అన్నాడు దానయ్య. "దాన్ని నాకు అమ్ముతావా, దానయ్యా?" అన్నాడు పెద్దవాడు.

"ఇంకా నయం! నేను దాన్ని తెచ్చి ఏడాది అయింది. ఇవాళో రేపో పిల్ల రాబోతూంటే నీకెందుకు అమ్ముతానూ? ఈ రకం గుర్రపుపిల్ల రెండువంద లిస్తే వస్తుందా?" అన్నాడు దానయ్య.

"రెండు వందలు తీసుకుని దాన్ని నాకియ్యి, దానయ్యా! గుడ్డులో నుంచి గుర్రపు పిల్ల రావటం నేనెన్నడూ చూడలేదు!" అన్నాడు పెద్దవాడు.

దానయ్య చాలాసేపు బతిమాలించుకుని, "నీకు గనక ఇస్తున్నాను!" అంటూ రెండు వందలూ తీసుకుని ఆ రాయి వాడికిచ్చేశాడు.

తరవాత వారం రోజులపాటు అన్నదమ్ములు ఏడుగురూ దాని చుట్టూ కూచున్నారు. కాని ఎంతకూ గుర్రపు పిల్ల బయటికి రాలేదు. వాళ్లు వెళ్లి దానయ్యకి సంగతి చెప్పారు.

"పెంకు మందం కావటంవల్ల గుడ్డు చిట్లి ఉండదు. మీరు దాన్ని కొండమీదికి తీసుకుపోయి ఎత్తునుంచి కింద పడెయ్యండి. గుడ్డు చిట్లి పిల్ల బయటికి వస్తుంది," అన్నాడు దానయ్య.





ఆ రాతిని మోసుకుని ఏడుగురూ కొండ మీదికి వెళ్లి, శిఖరంమీదినుంచి పల్లానికి విసిరారు. అది దొర్లి ఒక పొదలోకి పోయింది. అక్కడ దాగిఉన్న కుందేలు బయటికి వచ్చి పారిపోయింది. "అదుగో, గుర్రప్పిల్ల! పట్టండి, పట్టండి!" అంటూ ఏడుగురూ దానివెంట పడ్డారు. కాని కుందేలు వాళ్లకి అందలేదు.

"ఇప్పుడు పుట్టిన పిల్లే ఇంత బాగా దౌడు తీసిందే! ఇంకో నాలుగైదేళ్లకు దీనితో సమంగా ఏ గుర్రమైనా పరిగెత్తేదేనా?" అనుకుంటూ వాళ్లు ఇంటికి తిరిగివచ్చారు.

ఇంకొకనాడు పెద్దవాడు కిటికీకి ఎదురుగుండా కుర్చీ వేసుకుని కూర్చున్నాడు. కొంతసేపటికి ఆ కిటికీలోనుంచి వచ్చి ఎండ వాడిపైన పడింది. వాడు వెంటనే తాపీవాడికి కబురు చేసి, "ఒరే, ఈ కిటికీని తక్షణం పక్కకు జరపాలి. ఏం కావాలన్నా ఇస్తాను! దీనిలోనుంచి వచ్చి ఎండ నాపైన ఎలా పడుతున్నదో చూశావా?" అన్నాడు.

"అయిదు నిమిషాల్లో కిటికీ జరిపేస్తాను, బాబయ్యా! నాకు తమ బీడు రాసి ఇప్పించండి, చాలు!" అన్నాడు తాపీవాడు.

"అలాగే! ముందు నువ్వీపని చెయ్యి!" అన్నాడు పెద్దవాడు.

"తమరు అలా షికారు వెళ్లి రండి!" అన్నాడు తాపీవాడు. పెద్దవాడు వెళ్లి మళ్లీ



పావుగంటలో తిరిగి వచ్చేశాడు. ఈలోపుగా తాపీవాడు కుర్చీని పక్కకు జరిపాడు. పెద్ద వాడు రాగానే, "ఇప్పుడు కిటికీ ఉండ వలిసినట్టుందా బాబయ్యా?" అన్నాడు.

పెద్దవాడు కుర్చీలో కూచుని చూసు కున్నాడు. ఎండ తనమీద పడక అంత దూరంగా పడుతున్నది. "భేష్! ఆ బీడు నువ్వు తీసుకో!" అన్నాడు పెద్దవాడు.

ఈవిధంగా అందరూ మోసం చేశారు. శరభయ్యకుండిన ఆస్తి సమస్తమూ హారతి కర్పూరంలాగా హరించిపోయింది. వాళ్లకు ఇల్లూ, దొడ్డీ మాత్రమే మిగిలాయి.

ఒకనాడు దానయ్య తన పొలంనుంచి తిరిగి వస్తూ ఊరిబయట ఒక చెట్టుకింద ఏడుగురు అన్నదమ్ములనూ చూశాడు. వాళ్లు చుట్టూ కూచుని తమ కాళ్లను మధ్య పెట్టుకున్నారు.

"మీరంతా ఇక్కడ కూచుని ఏం వెలగ బెట్టుతున్నారూ? చీకటి పడబోతున్నది, ఇంటికి పోరాదూ?" అని దానయ్య వాళ్లను మందలించాడు.

"మాకూ అదే ఆలోచన! కాని ఎట్లా వెళ్లమంటావు, దానయ్యా? మా కాళ్లు చూడు ఎట్లా కలిసి పెట్టుకున్నామో! ఏవి ఎవరి కాళ్లో తెలియటంలేదు. ఎవరి కాళ్లు వారు తీసుకుని గద ఇంటికి వెళ్లేది!" అన్నారు మూఢులు.

"నేను విడదీసి యిస్తానుగాని, నాకు మీ ఇల్లూ దొడ్డీ ఇచ్చేస్తారూ?" అని దానయ్య అడిగాడు. ఇందుకు మూఢులు సంతోషంగా ఒప్పుకున్నారు. దానయ్య చెట్టు నుంచి ఒక కొమ్మ విరిచి బెత్తం తయారు చేసి అందరినీ తలా ఒక దెబ్బ కొట్టాడు. ఒక్కొక్కడే లేచి ఇంటివేపు పరిగెత్తాడు.

మాట ఇచ్చినప్రకారం ఆ మూఢులు తమకుమిగిలిన ఇల్లూ దొడ్డీకూడా దాన య్యకు ఇచ్చేశారు. తరవాత వాళ్లు ఏమ యారో ఎవరికీ తెలియదు.



# మందుకు తగిన రోగి




పెద్దమనిషి: (డాక్టరుతో) మీరు నిన్న ఇచ్చిన మందుతో నాకు ఆకలి లేకుండాపోయింది

పేదరోగి: బాబూ, ఆ మందు నాకు ఇప్పించండి!



# దక్షిణ ధ్రువ ప్రాంతపు వింతలు



**1957** జూలై 1 నుంచీ భూస్వరూప రహస్యాలను పరిశోధించటానికి ప్రపంచంలోని అన్ని దేశాలూ సమిష్టి కృషి ప్రారంభించాయి. ఆనాడు ప్రారంభమైన దాన్ని "జియోఫిజికల్ యియర్" అంటారు.

ఈ పరిశోధనలు దక్షిణధృవ ఖండమైన అంటార్క్టికాలోకూడా సాగాయి. ఆ మంచు కప్పిన నిర్జన ఖండంమీద 10 దేశాలవారు 46 పరిశోధనా కేంద్రాలు నెలకొల్పారు. ఈ సందర్భంలో సోవియెట్ శాస్త్రజ్ఞులు దక్షిణ అయస్కాంత ధృవంలోనూ, అమెరికనులు దక్షిణధృవంలోనూ పరిశోధనా కేంద్రాలు నెలకొల్పారు.

ప్రస్తుతం మనం అమెరికనులు శాస్త్ర పరిశోధనా కేంద్రం నెలకొల్పిన వివరాలు తెలుసుకుందాం.

ఈ కేంద్రాన్ని నెలకొల్పటానికి మూడేళ్లపాటు ప్రయత్నాలు జరిగాయి. 1956 జనవరిలో ఈ కేంద్రం నిమిత్తమై అడ్మిరల్ బర్డ్ మరొకసారి దక్షిణధృవం మీదుగా విమానంలో ఎగిరివచ్చాడు. అప్పుడు ఆయన వెంట డాక్టర్ పాల్ సిపిల్ అనే ఆయన కూడా ఉన్నాడు.

మనం గడిచిన నెలలలో బర్డ్ అనుభవాలు తెలుసుకున్నాం. అప్పుడుకూడా ఆయనవెంట పాల్ సిపిల్ ఉన్నాడు. నిజానికి, బర్డ్ దక్షిణ ధృవప్రాంతానికి వెళ్లినప్పుడల్లా పాల్ సిపిల్ ఆయనవెంట ఉంటూనేవచ్చాడు.

మొట్టమొదటిసారి అడ్మిరల్ బర్డ్ దక్షిణ ధృవప్రాంతానికి బయలుదేరి పోతూ తనకు తోడుగా ఉండటానికి స్కౌట్ కుర్రవాడు కావాలని ప్రకటించినప్పుడు వెయ్యిమంది కుర్రవాళ్లు దరఖాస్తులు పెట్టుకున్నారు.

బర్డ్ ఆ వెయ్యిమందిలోనుంచి ఈ పాల్‌ను ఎన్నుకుని, తాను దక్షిణ ధృవ

దక్షిణధృవాన శాస్త్రపరిశోధనా కేంద్రం




ప్రాంతానికి వెళ్లినప్పుడల్లా పాల్‌ను తన వెంటపెట్టుకు వెళ్లాడు.

అందుచేత దక్షిణధృవాన ఒక అమెరికన్ శాస్త్ర పరిశోధనా కేంద్రం స్థాపించాలన్న నిర్ణయం జరిగినప్పుడు దానికి అధిపతిగా డాక్టర్ పాల్ సిపిల్‌ను బర్డ్ శిఫార్సు చేశాడు. (దురదృష్టవశాత్తూ 1957 మార్చి 11 న బర్డ్ మరణించాడు.)

ఈ కేంద్రానికి అముండ్సెన్—స్కాట్ స్టేషన్ అని పేరు పెట్టారు. ఈ ఇద్దరూ మొట్టమొదటగా దక్షిణధృవాన్ని కాలినడకను చేరిన ధీరులు. 1911 డిసెంబరు 14 న అముండ్సెన్ అనే నార్వేదేశస్థుడు మొట్టమొదటగా దక్షిణధృవాన్ని చేరుకున్నాడు. ఈ సంగతి కాప్టెన్ స్కాట్ (బ్రిటిషు దేశస్థుడు) ఎరగడు. 1912 జనవరి 18 న ఆయన తన నలుగురు అనుచరులతోనూ దక్షిణధృవాన్ని చేరుకుని అక్కడ బ్రిటిషు జెండా పాతబోయేసరికి, అదివరకే పాతి ఉన్న నార్వే జెండా కనిపించింది. స్కాట్ హతాశుడయాడు. వీరిద్దరి పేరా ఈ అమెరికన్ స్టేషను స్థాపించబడింది.

దీని స్థాపనకూడా ఒక చిన్న కథ. అంటార్కిటికాలో అమెరికనులు మొత్తం ఆరు స్టేషనులు నియమించ నిశ్చయించారు. వాటిలో ఈ అముండ్సెన్-స్కాట్ స్టేషను ఒకటి. వీటి నిర్మాణానికీ, రక్షణకూ గాను అమెరికను నౌకా, వైమానిక శాఖలకు చెందిన సైనికులు నియోగించబడ్డారు. వీరంతా రియర్ అడ్మిరల్ జార్జి జె. డూఫెక్ అధ్వర్యాన పనిచేశారు. ఆయన మక్‌మర్డో సౌండ్ అనే ప్రాంతంలో - రాస్ సముద్ర తీరాన - తన స్థావరాన్ని నిర్మించుకున్నాడు. సరుకు సరంజామాలతో బ్రహ్మాండమైన విమానాలు అక్కడ వచ్చి దిగాయి.

ఇంత పెద్ద విమానాలు దిగగలందులకు అనువుగా మంచు చదునుచేసి 6000 అడుగుల పొడుగున దారి తయారు చేశారు.



మక్‌మర్డో సౌండ్ నుంచి దక్షిణధ్రువానికి 850 మైళ్లు. 1956 అక్టోబరు 31 నాడు జార్జి డూఫెక్ ఆరుగురు మనుషులను వెంట బెట్టుకుని విమానంలో దక్షిణధ్రువాన దిగాడు. వీరు ఏడుగురూ దక్షిణధ్రువంమీద నిలబడిన మొదటి అమెరికనులు. అంతకు మునుపు బర్డ్ విమానాలలో చాలాసార్లు ఈ ప్రాంతంమీదుగా ఎగిరాడు, కాని అక్కడ కాలుపెట్టిన తొలి అమెరికనులు మాత్రం వీరు ఏడుగురే.

అయితే వారు అక్కడ ఎంతోసేపు ఉండలేదు, స్టేషను నిర్మాణం అసలే సాగించలేదు. అక్కడి చలి మంచు చలికి 58 డిగ్రీలు హెచ్చుగా ఉన్నది. 10 మైళ్ల వేగాన శీతగాలి వీస్తున్నది. 49 నిమిషాల అనంతరం అందరూ విమానంలో ఎక్కి, చలికి బీటలు పడిన ముఖాలతో, మక్‌మర్డో సౌండుకు వచ్చి చేరారు.

ఈ 49 నిమిషాలలోనే విమానం మంచుకు కరుచుకుపోయి ఒకంతట ఊడి రాలేదు...

ఇవి దక్షిణధ్రువానికి పగటి రోజులు. ఇక్కడ రాత్రి పడిందంటే మరి ఆరు మాసాలపాటు సూర్యదర్శనం ఉండదు. ఈ దీర్ఘరాత్రి యావత్తూ ఈ ధృవంలో నిర్మించే స్టేషనులో మనుషు లుంటారు—డాక్టర్ సిపిల్, అతని 18 మంది అనుచరులూనూ. వీరిలో 9 మంది నావికాదళానికి చెందినవారు. మిగిలిన తొమ్మిదిమందీ శాస్త్రజ్ఞులు. ఈ ఆరునెలలపాటూ వారికి మిగతా ప్రపంచంతో సంబంధం ఉండదు; అక్కడినుంచి ఇక్కడికి రాకపోకలుండవు. స్టేషను నిర్మించటానికి అవసరమైన వస్తువులే గాక, ఇన్ని నెలలూ వీరందరికీ సరిపోయే ఆహారమూ, ఇంధనమూ, శాస్త్ర పరికరాలూ—మొత్తం 760 టన్నుల బరువు - మక్‌మర్డో సౌండు నుంచి దక్షిణధృవానికి చేరాలి. ఇందుకుగాను నాలుగేసి ఇంజన్లు

గల బ్రహ్మాండమైన "గ్లోబ్‌మాస్టర్" విమానాలుకూడా సిద్ధంగా ఉన్నాయి. కాని చలి అడ్డు వచ్చింది.

మరి మూడు వారాలు గడిచాక, నవంబరు 19 న ఎనిమిదిమంది మనుషులు లాగుడుకుక్కలతో సహా మక్‌మర్డో సౌండ్ నుంచి ధృవానికి బయలుదేరి అక్కడికి క్షేమంగా చేరారు. చలి మంచుకన్న 29 డిగ్రీలు మాత్రమే తక్కువ ఉన్నది. మనుషులు అక్కడ దిగుతూనే గుడారాలు వేసి, సూర్యుణ్ణిబట్టి ధృవం సరిగా ఎక్కడ ఉన్నదీ నిర్ణయించ నారంభించారు. ఇందుకై వారు ఆ ప్రాంతమంతటా సంచారం చేయవలిసి వచ్చింది. ఈ తిరుగుడు నిమిత్తం రెండు చక్రాలు లేని బళ్లూ, ఒక "వీజెల్" ట్రాక్టరూ పంపబడ్డాయి.

చిట్టచివరకు ధృవం "చిక్కింది." అది విమానాలు దిగిన చోటికి 8 మైళ్ల దూరాన ఉన్నది!....

అక్కడినుంచీ సామాన్లు గ్లోబ్‌మాస్టరు విమానాలలో ప్రవాహంలాగా వచ్చి చేరసాగాయి. ఆహారమూ, గృహనిర్మాణ సామగ్రీ, కర్రసామగ్రీ, రేడియో పరికరాలూ పారాషూట్‌ల సహాయంతో ఆకాశంనుంచి కిందికి దిగాయి. మరి పదిమంది నావికులు కూడా వచ్చి దిగారు. వారం రోజులు



తిరిగేలోగా దక్షిణధృవం ఒక స్థావరంలాగా తయారయింది.

తరవాత డాక్టర్ సిపిల్ వచ్చాడు. అప్పటికే అనేక గుడిసెలు లేచాయి. ఆహారం మొదలైనవాటిని మంచులో పాతర వేస్తున్నారు. ఆ ప్రాంతం అంతా చీమల పుట్టలాగా ఉన్నది.

ధృవాన్ని చేరుతూనే డా. సిపిల్ పార చేతబట్టి మంచు తవ్వసాగాడు. లోతున మంచు ఉష్ణోగ్రత కనుక్కోవాలని ఆయన ప్రయత్నం. 18 అడుగుల లోతు తవ్వటానికి 4 రోజులు పట్టింది. ఆ లోతున ఉన్న ఉష్ణోగ్రత మంచుచలికి 62 డిగ్రీలు తక్కువ.

ఒక గుడిసెనుంచి ఇంకొక గుడిసెకు వెళ్లటానికి మంచులో కందకాలు తవ్వారు. ధృవాన అమెరికను జెండా ఎత్తారు.

స్టేషను నిర్మాణం త్వరలోనే ముగిసింది. శాస్త్ర విజ్ఞానం శాస్త్ర పరిశోధనలకు ఏవిధంగా దోహదం చేసిందీ తెలుసుకోవాలంటే ఈ స్టేషనే మంచి నిదర్శనం.

దీని నిర్మాణానికి 45 సంవత్సరాల పూర్వం దక్షిణధృవాన అడుగు పెట్టిన అముండ్సెన్, స్కాట్ల ముఠాలవారు పడరాని పాట్లు పడ్డారు. వారికి ఉండటానికి గుడారాలు తప్ప లేవు, తిండిలేదు. స్కాట్, అతని అనుచరులూ ఆ ప్రాంతానే తిండిలేక మరణించారు.

కాని 1956 చివరలో ఏర్పాటైన ఈ స్టేషను దాదాపు ఇరవైమంది మనుషులు ధృవప్రాంతపు చలిలో సుఖంగా జీవించటానికి అనువుగా ఉన్నది. వెచ్చని భోజనశాలా, వంటశాలా, టేప్ రికార్డరుతోబాటు బిథోవెన్ సంగీతమూ, ఫ్లారిడానుంచి వారం రోజులలో చేరే ఉత్తరాలూ—ఇలాటి సౌకర్యాలన్నిటినీ శాస్త్ర విజ్ఞానం సమకూర్చింది. దక్షిణధృవాన్ని వాసయోగ్యం చేయగలిగిన విజ్ఞానం ఏది సాధించలేదు!



# 3. నేషనల్ మెటలర్జికల్ లెబొరెటరీ - జమ్‌షెడ్‌పూర్

మన దేశపు లోహపరిశ్రమల అభివృద్ధికిగాను ఒక నేషనల్ మెటలర్జికల్ లెబొరెటరీ స్థాపించాలన్న నిర్ణయం 1942లో జరిగింది. మరునటి సంవత్సరం అందుకొరకు ఒక ప్లానింగ్ కమిటీ ఏర్పాటయింది. అప్పట్లో తాత్కాలిక జాతీయ ప్రభుత్వ విద్యా కళాశాఖల మంత్రిగా ఉండిన శ్రీ. సి. రాజగోపాలాచారి 1946 నవంబరు 21న ఈ లెబొరెటరీకి శంకుస్థాపన చేశారు. 1950 నవంబరు 26న ఈ సంస్థకు ప్రధాని నెహ్రూ ప్రారంభోత్సవం చేశారు.

ఇది జమ్‌షెడ్పూరులో ఒక మూడంతస్తుల భవనం. రెండవ అంతస్తూ, కింది అంతస్తులో కొంతభాగమూ, పై అంతస్తులోని సమావేశాల గదీ ఎయిర్ కండిషనింగ్ చేయబడ్డాయి. ఈ సంస్థకు చెందిన కార్ఖానాలో సరికొత్త యంత్రసామగ్రి ఉన్నది. దీని సహాయంతో యంత్రాలూ, పరికరాలూ, మరమ్మతులూ జరుగుతవి.

ఈ సంస్థలో అన్నిరకాల లోహ పరీక్షలు జరపటానికి సాధన సామగ్రి ఉన్నది; అములూ, బట్టీలూ, వేడికి తట్టుకునే పదార్థాల నిర్మాణానికిగాను ఏర్పాటయాయి. ఇక్కడ లోహ మృత్తికలను, ఖనిజాలనూ, లోహాలనూ, మిశ్రలోహాలనూ మొదలైనవాటిని పరీక్షిస్తారు.

పారిశ్రామిక సంస్థలూ, ప్రభుత్వమూకూడా తమ సమస్యలను ఈ సంస్థకు తెలుపుతూ ఉంటారు. కొన్ని సమస్యలు కొత్త పారిశ్రామిక యత్నాలకు సంబంధించి ఉంటాయి. మరి కొన్ని పాత పరిశ్రమలలో ఏర్పడే చిక్కులకు సంబంధించి ఉంటాయి. అన్ని సమస్యలనూ పరిష్కరించటానికి ఈ సంస్థ కృషిచేస్తుంది.



# మన శరీరాలు

అప్పుడు పుట్టిన బిడ్డ మెదడు సుమారు 30 తులాల బరువుంటుంది. పూర్తిగా పెరిగిన మనిషి మెదడు బరువు వీశెకు పైగా ఉంటుంది. ఆడవాళ్ల మెదడు బరువు కొంచెం తక్కువ, మగవాళ్లది ఎక్కువ.

*    *    *

తలమీది వెంట్రుకలు చదరపు అంగుళానికి సుమారు వెయ్యీచొప్పున ఉంటాయి. సాధారణంగా మనిషి తలలో లక్షకు పైబడిన వెంట్రుకలుంటాయి. నల్లని జుట్టు కలవాళ్లకు కంటె తెలికరంగు (రాగి) జుట్టు కలవాళ్ల తలలలో హెచ్చు వెంట్రుకలుంటాయి. తల వెంట్రుకలు చాలా బలమైనవి; అన్నిటిపైనా బరువు సమంగా పడినట్టయితే ఒక్క మనిషి తలవెంట్రుకలతో అయిదు టన్నుల బరువు ఎత్తవచ్చును. తలవెంట్రుకలను తలనుంచి వేరుచేసి తాడుగా పేనినట్టయితే ఆ తాడు 10 టన్నుల బరువును తెగకుండా మోయగలదు.

*    *    *

అప్పుడు పుట్టిన బిడ్డలకు దాదాపు చూపు ఏమీ ఉండదు. ఏడాది బిడ్డలకు పదోవంతు చూపుమాత్రమే ఉంటుంది. నాలుగైదేళ్ల వయసుకుగాని సరిఅయిన చూపు రాదు. పెద్దవాళ్లకు వచ్చే చత్వారం 52వ ఏడుదాకా ముదురుతుంది. ఆ తరవాత దృష్టిలో మార్పులుండవు.

*    *    *

మన శరీరాలలో 222 ఎముకలున్నాయి. శరీరపు బరువులో నూరింట 15 వంతులు ఎముకలదే. ఎముకలు చాలా గట్టివి—కొయ్యకంటె మూడింతలు గట్టివి. శరీరంలోని ఎముకలన్నిటికన్నా ఎక్కువ గట్టిది మోకాలికి దిగువగా ఉండే ఎముక.

*    *    *

మన రక్తం నీటికంటె ఆరింతలు చిక్కగా ఉంటుంది. అందులో 250000,0000000,0000000 (రెండున్నర లక్షల కోట్ల కోట్లు) ఎర్ర కణాలున్నాయి. ఇవి ఊపిరితిత్తులనుంచి శరీరానికంతకూ ప్రాణవాయువును చేరవేస్తాయి. రక్తంలో ఎర్ర కణాలకన్నకూడా హెచ్చు సంఖ్యలో తెల్ల కణాలున్నాయి. ఇవి అంటువ్యాధులను ప్రతిఘటించుతాయి.

*    *    *

రక్తాన్ని శరీరమంతటా ప్రసారంచేసే "పంపు" గుండెకాయ. ఇది విరామం లేకుండా పని చేస్తుందనుకోవటం సరికాదు; ప్రతి స్పందనానికీ స్పందనానికీ మధ్య సెకండులో ఆరోవంతు కాలం ఇది విశ్రాంతి తీసుకుంటుంది.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 సెప్టెంబర్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పసి గట్టిన దొంగలు

రెండవ ఫోటో : కసి పట్టిన కొంగలు

పంపినవారు : బి. వనమయ్యా,

కోవెలకుంట్ల పోస్టు, (కర్నూలు జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు 'టైగర్'ను వెంటబెట్టుకుని మామిడితోటకు వెళుతూండగా, ఒక నీటిమడుగు పక్కన పెద్ద పొట్టేలొకటి వాళ్లదారిని అడ్డగించింది. దానిని మేపుతున్న కొంటెకుర్రాడు పొటేలును వాళ్లమీదికి మరింతగా ఉసిగొలపసాగాడు. 'టైగర్' చడీచప్పుడూ లేకుండా పొటేలు వెనకకు వెళ్లి, దాని తోక పట్టుకున్నది. పొటేలు గిరుక్కున వెనుదిరిగేంతలో, 'టైగర్' తోక వదిలి, నీటి మడుగులో దూకి అవతలి గట్టుకు ఈదుకుపోయింది. దానివెంట పడిన పొటేలు మడుగులో వున్న తామరకాడల్లో చిక్కుకుపోయింది. కొంటెకుర్రాడు లబోదిబోమంటూ నీటిలో దూకి, పొటేలును ఒడ్డుకు లాక్కొచ్చుకున్నాడు.






**Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

మనోహరమైన
ముఖలావణ్యమునకు











సినిమా తార
లందరకు నచ్చినది

**ది నేషనల్ ట్రేడింగ్ కంపెని, బొంబాయి-2 * మదరాసు-1**

---

# ఇన్ఫెన్టోన్
## గ్రైప్‌వాటర్

తక్షణ నివారణ కోసం




పసిబిడ్డలకు దివ్యమైన గ్రైప్ మిక్స్చర్. కడుపు నొప్పి, పళ్లు వస్తున్నప్పుడు, కడుపులో వాయువల్ల, కలిగే ఇబ్బందిని తక్షణం నివారించును. పసిబిడ్డలను ఆనందంగాను ఆరోగ్యంగాను వుంచును. 40 ఏళ్లకు మించి బాగుగా ప్రసిద్ధియున్నట్టిది.

నిర్మాతలు :
**హైదరాబాద్ కెమికల్స్ అండ్ ఫార్మసుటికల్ వర్క్స్ లిమిటెడ్.**
**హైదరాబాద్-దక్కన్**

PSHC-48

ఆధునిక యంత్ర
పరికరములతోను
సాంకేతిక
నిపుణులతోను
అమరివున్న
బ్రహ్మాండమైన సంస్థ






ఆఫ్‌సెట్టు ప్రింటర్సు

## ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లి. మదరాసు-26

ప్రతినిధి కార్యాలయాలు:

కె. ఏ. డి. నివాస్, (3వ ఫ్లోరు) మూగ్‌భాట్ వీధి, బొంబాయి-4. (ఫోన్: 75526)

ఎ/11, 5 మెయిన్ రోడ్, గాంధినగర్, బెంగళూరు-9. (ఫోన్: 6555)

# దీనిని చదివితే మీరు ఆశ్చర్య పడతారు



ఏజియన్ సముద్రంలో, ఒక చిన్న లంకవుంది. దాని పేరు అర్గంటేరియా దానినేల సబ్బు గుణములో కూడి వుంది. ఆనేలమీద కొంచెం నీళ్లు పోస్తే నురగ వస్తుంది. ప్రత్యేకంగా వర్షం వస్తే లంకంతటా నేలమీద మోకాటిలోతు నురగవుంటుంది. ఆ లంకలో నివసించే జనులు, ఎల్లప్పుడూ ఆనురగను బట్టలుతక డానికీ, స్నానానికి కూడా వాడుకొనేవారు.



సబ్బులాంటి వస్తువును శరీరాన్ని శుభ్రపర్చుకోడానికి వాడుకోవటం, క్రొత్త సంగతి కాదు. ఇలాంటి వస్తువులు గత 2500 ఏళ్లనుంచీ వాడుకలో వున్నాయని చరిత్రను బట్టిమనకు తెలుస్తోంది.



సబ్బును వైజ్ఞానికపద్ధతిలో తయారు చేసినకీర్తి ప్రతిష్ఠ చవ్‌రాల్ అనే పేరుగల ఒక ఫ్రెంచి వ్యక్తికి చెందుతుంది, ఆయన 1813లో మొట్ట మొదటి సబ్బును తయారు చేశారు.

లైఫ్‌బాయ్ సబ్బు 1894లో పుట్టింది. అది ఈనాడు ప్రతి దేశంలోనూ, ఆరోగ్యానికీ పరిశుభ్రతకూ అంతర్జాతీయ రాయబారియైవున్నది. అందుకు కారణం యిది; మనం ఏంచేస్తున్నా-ఆడుకుంటున్నా, లేదా చదువుకుంటున్నా ఎల్లప్పుడూ మురికౌతాము, ఆమురికిలో వ్యాధిని కలిగించే క్రిములున్నాయి. అవి దుర్భిణి మూలకంగా మాత్రమే కనిపిస్తాయి. లైఫ్‌బాయ్‌లో గల ముఖ్య గుణమేమి టనగా, అది ఆక్రిములను కడిగివేసి మీ ఆరోగ్యమును కాపాడును. మీరు కూడ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానముచేయుట అలవాటు చేసుకొని, ఆవిధంగా మీ ఆరోగ్యమునుకాపాడుకోండి.




L. 276-50 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి తయారీ.

 Photo by P. B. Khata



బహుమతి
పొందిన వ్యాఖ్య

కసి పట్టిన కొంగలు

పంపినవారు:
బి. వనమయ్య - కోవెలకుంట్ల

